# ఇందలి ముఖ్యపాత్రలు.

## పురుషులు.

కృష్ణుఁడు

బలరాముఁడు

సాత్యకి

అక్రూరుఁడు

సత్రాజిత్తు

శతధన్వుఁడు

రుక్మి

కౌశికుఁడు

## స్త్రీలు.

సత్యభామ

వసంతిక

ఓం

శ్రీకృష్ణ పరబ్రహ్మణేనమః

# సాత్రాజితీ పరిణయము.

[నాంది]

శా॥ శ్రీమద్గోపకులోద్వహుండగుచు ధాత్రీభారముఁ డించి సు
త్రామాద్యాశ్రితబృందముఁ గరుణ సంరక్షించి లోకావనిం
దామందాకమణంచి బంధుజను లాహ్లాదింప సాత్రాజితీ
రామారత్నము నేలు శౌరి మిము నశ్రాంతంబుఁ గాపాడుతన్.॥

సూత్ర—(నాంద్యంతమున) నటీ! హారికథాకాలక్షేపమునకుఁ బాత్రం
బుల సిద్ధపఱచితివే!

నటి—ఆర్యపుత్రా? ఇచ్చట నున్న వారందఱు మాధవచరణారవింద
ధ్యానైకచిత్తులయి యుందురే!

సూత్ర — పిచ్చిదానా! వీరన నేల! మర్త్యామర్త్యలోకంబుల వాసుదే
వుని వృత్తాంతంబు విననొల్లనివారుందురా!

సీ॥ ఆకారశూన్యుఁడై సాకారుఁడై మౌని
చిత్తసౌధములందుఁ జెలఁగునెవఁడు
భవవిదూరుండయ్యు భవబంధములఁగూడి
కరుణచేభక్తాళిఁ గాచునెవఁడు
గుణరహితుండయ్యు గుణసమన్వితుఁడౌచు
దుష్టదైత్యశ్రేణిఁదునుము నెవఁడు

నామధేయము లేక నామాంతరములొంది
మాయచే భువనాళి మనుచు నెవఁడు
జన్మరాహిత్య మెవ్వని స్మరణఁగలుగు
నెవని చరితంబు వినఁ బాపమెగిరిపోవు
నెవఁడు నిత్యుఁడు కైవల్య మెవఁడొసంగు
నట్టి హరికథ విన నెవ్వ రాశపడరు!

నటి — మనమిప్పు డేనాటకముఁ బ్రదర్శించెదము!

సూత్ర — సాత్త్రాజితీ పరిణయము.

నటి — ఆనాటక కర్త యెవరు?

సూత్ర —

మ॥ కవిరాజుల్ పొగడన్ సుధర్మ విజయాఖ్యన్ బొల్చు దృశ్యప్రబం
ధవరంబున్ రచియించి మించిన యశోదారుండు శ్రీశేషయా
ర్యవరేణ్యాత్మభవుండు సద్బ్రనవరాజానూన నామాన్వయో
ద్భవ సీతాపతిరావు వ్రాసె బుధబృందంబెన్న దానిన్ సఖీ

నటి — ఆనాటకరాజంబును మన సమాజికులు సక్రమముగాఁ బ్రదర్శిం
చి వివిధవిద్యాధురంధరులైన యీ సభాసదుల డెందంబున కమం
దానందంబుఁ గల్పింపఁగలరె!

సూత్ర — చెలీ! మనవారలు నాటకప్రయోగమునందు సమర్థులైయుం
డ నీవిట్లుల సంశయించుచుంటివి! నేటిప్రదర్శనమునం దొకానొక
వేళ లోపంబులుండినను వీరలు హర్షస్వాంతులు కాఁగలరు.

నటి — నయస్యా! మీరిటుల సాహసించి పలుకుట కారూపకమునం
దంత మహిమ యేమిగలదు

సూత్ర — తే గీ॥ వీరశృంగారరసముల పెంపుఁగాంచి
లలితమగు శౌరిచరితంబు దెలుపునట్టి
నాటకంబెందు జనులకానందమిడదె
లోటులుండిన మనయాట పాటలందు?

ఇంతియకాదు. హరినామస్మరణ వినినంతనె యెట్టిమనుజుని మనం బైన హర్షంబున నుప్పొంగుచుండఁ దచ్చరితం బాకర్ణించి విలోకించువారలకు హృదయోల్లాసం బుదయింపకుండునా!

నటి—అటులైన మనమదృష్టవంతులమె. ఇంకఁ బ్రదర్శనమున కేమి యాటంకము.

సూత్ర—నవనాగరికులైన యీసభ్యులు ప్రప్రథమమున హృదయానందకరంబగు నీగానంబు వినఁగోరెదరను విషయం బీవెఱుంగవే!

నటి—ఏపాటఁబాడిన వీరి కామోదంబు గలుగును?

సూత్ర— ఇది కేవలము వినయోక్తియని తలంచెద.

నటి—ఆర్యపుత్రా! అటులఁగాదు. స్త్రీలు స్వతంత్రించి చేయునెడ నిర్దుష్టకార్యములందైన నేదోయొక లోపంబుఁ గల్పించి వారలదూఱుట మగవారికి నైజగుణము. కావున నీవిషయంబున మీయనుజ్ఞఁ బడయఁగోరితి.

సూత్ర—గుణగ్రహణపారీణులగు విద్యాధికులెన్నఁడు నట్లు చేయరు గదా! అయినను నాయందుఁ బెద్దఱికముంచి నన్నడిగితివిగాన నిర్హేతుకముగా నీయందట్టి లోపంబుల నీసభాస్తారులు నిరూపింపకుండ నేనే యాభారమునువహించి చెప్పెదను.

తే॥ గీ॥ అలరుసొంపున నొకకొమ్మ యవతరింప
దానితోఁగూడి వర్తింపఁ దారసిల్లు
మాధవామోదవర్ణన మధురగాన
జలనిధినిముంచి తేల్పుమీ సభ్యవరుల॥

నటి — కవిరాజవిరాజితము.

వనసతి మంజులతాతనువొంది సువాసనమించు సరోజవరా
ననమున నొప్పి యనంతసుమాభరణంబులఁదాల్చి పికాళికల

స్వనయము బంధుర వేణిఁ జెలంగిన భావభవ ప్రోద్భవ తాపమునే
మ్మనము గలంపఁగఁ దత్సఖికై చను మాధవుఁ డిచ్చుత మోదములన్॥

సూత్ర—

మ॥ చెవికింపై, రసవంతమై యనుపమ శ్రీమూలమై, తాళమా
ర్దవమై, తూర్లరగంగఁ జేయునదియై, రాగోచితాలాపమై
స్తవమౌ నీమృదుగానకౌశలము నాశాపేందుసందర్శనో
ద్భవచింతాన్విత కృష్ణుఁడై నవిన వంతన్ బాసి హర్షింపఁడే॥

(తెరలో)

మ॥ పురసంహారకురాణి నాలయమునన్ బూజించుచోఁ జూచి దు
ర్భర మోహాంబుధిమగ్ని సంతతము నేవాంఛించు సాత్త్రాజితిన్
వరియింపన్ దలఁచు నాయధముఁడా పాపాత్ముఁడా క్రూరుఁడా
స్మరజాడ్యాంధుఁడు కృష్ణుఁ డేఁగలుగ హర్షంబంది పెంపొందునే॥

నటి—మారిషా! అది యేమి!

సూత్ర—కృష్ణద్వేషియైన శతధన్వుం డిటులఁ బ్రేలుచు రుక్మితో నుద్యా
నవనంబునఁ బ్రవేశించుచున్నవాఁడు. మనము పోవుదము రమ్ము.

(నిష్క్రమింతురు.)

ఇది ప్రస్తావన.

---

ప్ర థ మా ం క ము.

ప్రవేశము – శతధన్వుఁడు – రుక్మి – ఉద్యానవనము.

శత—(కోపముతో)

మ॥ పురసంహారకురాణి నాలయమునన్ బూజించుచోఁ జూచి దు
ర్భర మోహాంబుధిమగ్ని సంతతము నేవాంఛించు సాత్త్రాజితిన్
వరియింపన్ దలఁచు నాయధముఁడా పాపాత్ముఁడా క్రూరుఁడా
స్మరజాడ్యాంధుఁడు కృష్ణుఁ డేఁగలుగ హర్షంబంది పెంపొందునే॥

మిత్రమా! భగవంతుండని విఖ్యాతిగాంచిన నా జగద్వంచకుని వంచింప నెవ్వరు సాహసింపరేమి! ఎట్టి దుండగములఁ దలపెట్టుచుండిన నెట్టి ఘోరకృత్యంబులొనర్చుచుండిన నాతని యడుగులకు మడుగులొత్తుచు ఘన మూరకుండవలయునే! బల్లిదులను పేరుపెట్టుకొని మీసముల దువ్వు జరాసంధాదులును వాని యెడల నుపేక్షచేసెదరేల!

రుక్మి — బావా! కృష్ణ దార్ష్ట్యమును మరలించు నంతటి మగతనము మన జరాసంధున కెచ్చటనుండి తెచ్చెదము?

ఉ॥ బల్లిదుఁడేని మాగధుఁడు బాహుబలంబునఁ గంసవైరి నా
చెల్లెలిఁగొన్న కాలమునఁ జేదిధరారమణుండు మెచ్చ స
ద్భల్లకమూని వాని నతిదారుణసంగరరంగమందు ను
త్ఫుల్లపరాక్రమోద్ధతి నెదుర్కొనఁజాలక పాఱివచ్చునే॥

శత — ఔనౌను. చచ్చినఁ జచ్చునుగాని యోధాగ్రేసరుండైనవాఁడు సంగ్రామరంగంబును విడిచి పాఱిపోవునె. వలచిన కన్యకామణిఁ గొనిపోవుచుండ గాజులు తొడిగిన యాఁడుదానివలె నా శిశుపాలుండు మూరకుండెఁగాని దోర్దండపరాక్రమాభీలుండగు నీశతధన్వుండైన నా నందనందను నీకరాళ కరవాలంబునకు బలిపెట్టకుండునే!

చ॥ బ్రతికిననాల్గునాళ్ళు నిజపౌరుషలీలఁ జరింప లేనిచో
బ్రతుకఁగనేల! దేహమెడఁబాసిన భూమికివెళ్ళియౌనె! శా
శ్వతయశమంద యుద్ధమున వైరిని డీకొనఁజెల్లుఁగాని నిం
దితముగ వెన్నుఁజూపి చనుదెంచిన నవ్వరె యోధవర్యులున్॥

బావా! మధురానగరంబుపై దండెత్తి సాహసించి గోపాలబాలకుని బాఱదోలిన యాజరాసంధున కిట్టి పిఱికితన మెట్లులబ్బె! సమస్త రాజలోకంబున నజేయులని పేరుపడిన శిశుపాల దంతవక్త్రులెందుల కూరకుండిరి!

రుక్మి — చేతగాక; చేయునదేమియు లేక; శూరసింహులని పేరుమ్రోగినవారిట్లు వెనుదీయుటచేతనే నీవు గోరిన కన్యారత్నమున్గూడఁ

# సాత్రాజితీ పరిణయము.

గృష్ణుం డుద్వాహమాడఁ దలఁచియున్నవాఁడు.

శత—శతధన్వుని కంఠములో నూపిరి యున్నంతవఱకు సాత్రాజితిని గృష్ణుండుగాని గిష్ణుండుగాని వివాహమాడలేడు. ఒకానొకవేళ నను మోసగించి నీచెల్లెలివలె నెత్తుకొనిపోయిన నీ శతధన్వుండు శిశుపాలునివలెఁ జేతులు ముడుచుకొని యూరకుండఁడు.

చ॥ మెలఁత గ్రహించి యాఖలుఁడు మింటఁ జరించినఁ గాన కేగినన్
జలములఁ జొచ్చినన్ విబుధసౌధపథంబుల డాఁగియుండినన్
వలిమల నెక్కినన్ ఫణులపన్నగవీథులఁ బాఱిపోయినన్
దలఁగక వాని ద్రుంచి ప్రమదంబున నాచెలిఁ బెండ్లియాడెదన్॥

రుక్మి—నీ పిచ్చిశపథంబులకేమి! కాళ్ళుగడపలదాఁటింపలేని నీవుమాత్ర మాకృష్ణుని జయింపఁగలవే!

శత—ఏమీ! నాకాళ్ళు గడపలుదాఁటవుగా! చెల్లెలి నొప్పగించి గొల్లవానిచేత మీసముగొఱిగించుకొనివచ్చిన రుక్మి ననుకొంటివా యేమి!

రుక్మి—యోధానుయోధులైన జరాసంధాదులు సహితము బల్లము గొట్టిన ఱాళ్ళవలెనుండ నేఁగనుక నే యీమాత్రమైన నాజగజెట్టితోఁ బోరాడినచ్చితి. నీవైనచో వారలవలె నామహానుభావునకుఁ జేతులొగ్గి నమస్కారంబుఁగావించి కాలికొలఁది పరుగిడకుందువే!

శత—తగుదునని నోరెత్తి పరాక్రమధురంధర చక్రవర్తియైన యీ శతధన్వునిసహిత మాక్షేపించుచుంటివిగా!

తే॥ గీ॥ బాహుదర్పంబుగలిగిన బంటువేని
కూళయొక్కఁడు మీసంబు గొఱుగుచుండఁ
జేడెవలెనూరకుందువె! సిగ్గులేక
బీరములఁ బల్కెదేలర యోరిపంద!

రుక్మి—ఏమీ! నేఁ బందను! నీవు పోటుబంటువా!

ఉ॥ పేరువహించినట్టి యొకవీరునినైన దురంబునందు గం
భీరపరాక్రమంబునఁ దపింపఁగఁజేసి యెఱుంగనట్టి నీ

వే రణకోవిదుండవగు దేని మురారినెదిర్చినట్టి దో
స్సారవిభుండు రుక్మియొక శౌర్యసముద్రుఁడు కాకపోవునే॥

శత—కృష్ణునితోఁ బోరాడినప్పుడే నీధైర్యస్థైర్యంబులు జగద్విదితము యినవి. నీవింకఁ దెలుపనక్కఱలేదు.

రుక్మి—వేయేండ్లు తలక్రిందుగాఁ దపంబాచరించినను నీవుమాత్ర మా కృష్ణుని జయింపఁగలవే!

శత—ఏమీ! అటులనా!

చ॥ హరిహరులేగి సాయపడి యాతనిపక్షమునిల్చిపోరినన్
శరముగ్రహించి తచ్ఛిరము సంగరభూమినిఁ ద్రెళ్ళనేసి స
త్వరమున నేగుదెంచి శతధన్వుఁడు సత్యగ్రహింపకున్న నీ
శరముశరంబె మాటిపయి సాగెడుమీసము మీసమేయిఁకన్॥

రుక్మి—(తనలో) ఇంక వీనిని శాంతస్వభావునిగాఁ జేయవలయును. (ప్రకాశముగా) బావా! నీసామర్థ్యంబు నే నెఱుంగనా! నీవు కృష్ణునిపైకేగ నేమాత్రము దృఢచిత్తుండవైతివో యెఱుంగ నిట్టి నిష్ఠురోక్తుల నాడితి. ఎట్టులైన నాదురితాత్ముని బరిభవించి నాకడు పుమంటఁ జల్లార్పవలెఁ జుమీ!

శత—మిత్రమా! నీభావం బెఱుంగక కోపోద్రేకంబున నేనాడిన మాటల మన్నింపవేఁడెద. నీ వీ క్షణంబ సత్రాజిత్తునికడకేగి సాత్రాజితిని నాకిచ్చి వివాహంబొనర్చునటులఁ బురికొల్పుము. నే నింతలో నావచ్చుచున్న సాత్రాజితితోడ ముచ్చటించి మనోరథఫల సిద్ధుండనయ్యెద.

రుక్మి—(నిష్క్రమించును.)

శత—(వచ్చుచున్న సాత్రాజితి నుద్దేశించి)

మ॥ అరవిందాకృతిఁ గేరునెమ్మొగము; మత్స్యంబేలుఁగన్దోయి;బం
భరపాళిన్ నిరసించు ముంగురులు; బింబంబెన్నఁ గెమ్మోవి; కే
సరిజంకించెడుఁగౌను; హాటకము హాస్యంబాడుమైచాయ; య
య్యారె యీలేమకుసాటిరాఁగలరె మర్త్యామర్త్యభామామణుల్.

ఔరా! ఈచెలువ విలాసంబువర్ణింప నలువకుఁగాని, నలువరాణికిఁగాని, వేల్పులయొజ్జకుఁగాని, వేయినాలుకలుగల చిలువలఱేనికిఁగాని యలవియగునే! ఎట్టిమహూర్తమున నీనెలంత నాధాత సృష్టించెనోకాని వెతకిచూతమనిన నాపాదమస్తకపర్యంత మొక్కకొఱంత గానరాకుండెనే! ఈయువతి, యీలావణ్యవతిఁ యీసుగుణవతి యీసాత్రాజితి నాసతీమణిగాకున్న రాచపుట్టుకగాంచినఫలమేమి! ఐశ్వర్యముండిన లాభమేమి। (ఆలోచించి) నాబాల్యమిత్రుఁడగు కృష్ణుని వరించుచుండిన యీలేమను నేఁగోరుట దోషంబుకాదె! (ఆలోచించి)దోషమెట్లగును! స్నేహధర్మంబుల నాలోచించి చిరకాలసౌఖ్యప్రదంబులగు కాంతాకనకంబుల విసర్జింపవచ్చునే! పుత్రమిత్రకళత్రంబులవధించి క్షత్రియులు రాజ్యలక్ష్మిఁ గైకొనుటలేదె అవసరమగునేని యకృత్యంబులనైన నొనర్చి యీ రాజీవాక్షి నే నేలచేకొనఁగూడదు. (ఆలోచించి) ప్రాణాపద్రవము సంభవించిను దీనివిడువఁగూడదు. ఎట్లైనఁ బరిగ్రహించి తీరవలయును. కాని యీలేమ నాకెటుల లభించును! [ఆలోచించి] ఏకాంతంబుననుండ నీకన్నియకు నావిరహానస్థఁదెల్పిన నన్ను మన్నించి వివాహమాడకుండునే. ఇదిగో! సాత్రాజితియు, వసంతికయునిప్రక్కకే వచ్చునటులున్నది. నేనీలతానికుంజమధ్యంబున డాఁగి వీరి సరసాలాపంబుల నాలకించి సందర్భానుసారంబుగఁ గర్తవ్యమాలోచించెద.

(డాఁగికొనును)

[ప్రవేశము: వసంతిక, సాత్రాజితి]

వసం——చెలీ! నే నెన్నిసాగులడిగిన నీమనోహరుని యాకారమైన వర్ణింపవేమె! నీనెచ్చెలి యాధన్యునిపేరైన విన నోచికొనలేదే!

సత్య—చెప్ప సిగ్గగుచున్నది కాని చెప్పకేమి!

సీ॥ శంఖచక్రగదాది సాధనమ్ములవాఁడు
పట్టుచేలము మేనఁజుట్టువాఁడు
ధవళాబ్జములరీతిఁ దనరు కన్నులవాఁడు
సోముగోమునదల్చు మోమువాఁడు
వనమాలికోపేత వక్షమ్ముగలవాఁడు
నవరైనదీర్ఘహస్తములవాఁడు
శ్రీవత్సకౌస్తుభాంచిత చిహ్నములవాఁడు
కంబుడంబుహసించు గళమువాఁడు

సరసముగ వేణుగానంబు సలుపువాఁడు
బర్హిబర్హావతంసుఁడై పరగువాఁడు
మొలకనవ్వుల వలపించు మోవివాఁడు
గోపకులనీరుఁడాత్మనేఁ గోరువాఁడు॥

వసం—ఓహో! ఆమహానుభావుఁడేనా! నేనప్పుడే గ్రహించితి.

సత్య—వసంతికా

సీ॥ జలజాక్షుఁగనులారఁ దిలకింపకున్న నీ
కన్నులసొంపేల తెల్పవే కో—
కాంచనాంబరధారికడనుండకున్న నీ
హొయంపుఁదనువేల యెడ్వవే కో—
పతితపావనుతోడఁ బలుకాడకున్న నీ
మధురవాగ్గరిమేల మండవే కో—
శ్రితరక్షకునిభక్తి సేవింపకున్న నీ
జన్మమెత్తఁగనేల చావవే కో—
చెలియకృష్ణుండు నాప్రక్కఁ జేరనో కో—
సరససల్లాపములనన్ను సాఁకనో కో—

జన్మసాఫల్యమొందఁగాఁ జక్రపాణి
యెలమివరియించి సతిగ నన్నేలునొక్కొ॥

వసం—ఎప్పుడు గృష్ణుండు కృష్ణుండని కలవరించెదవేమే! లేశంబైన నీపైని మోహావేశంబు లేనివానిపై నీకెంత విరాళియేల!

సత్య—ఆమహానుభావునకు నాయందనురాగంబు లేదని నీవెట్లు చెప్పఁగలవె.

వసం—చెలీ! నీవెంతపిచ్చిదానవే! నందసుతునకు నీయం దనురాగంబుండునెడల నీకటాక్షవీక్షణంబుల దర్శింపఁగోరి నీచుట్టుఁదిరుగకుండునె! కరంబునిమ్మనుచు నీపాదంబులఁ బట్టుకొనకుండునే! పెక్కేల! దాసుండగుచుఁ బెండ్లియాడుటకు నీయెమ్మకలఁగొలుక కుండునే!

శత—[స్వగతము] సాత్రాజితి నన్నే వరించునటులఁ జేసెదనని నాకడ ద్రవ్యంబు గొనినందుల కీవసంతిక నెచ్చెలిమనం బెంతనేర్పుతోఁ ద్రిప్పఁబ్రయత్నించుచున్నది! ఔరా! లంచగొండు లెంతకుఁజాలరు.

సత్య—వలపులేని చెలిగూడఁ బ్రయత్నించుమూ ఘుండటులఁజేసినఁజే యుఁగాక. రమణులపైఁ దమకెంత విరాళియుండినఁ బురుషశ్రేష్ఠు లంతటి నీచకృత్యంబులకు లోఁబడుదురే?

వసం—పోనిమ్ము. క్షత్రియాచారముననుసరించి తుదకు రాయబారంబైనఁ బంపియుండడె! వలచివలచి కొనివచ్చిన రుక్మిణిదేవి యుండ నతండు నిన్నేమని పెండ్లియాడునే! ఒకవేళ వివాహమాడఁ దలంచిన నారుక్మిణి యూరకుండునా! దేవకీదేవి తగదని బుద్ధిచెప్పకుండునా!

సత్య—రుక్మిణీదేవివంటి మహాపతివ్రత పతి కనుకూలవతియై సంచరించుఁగాని యతనిఁగాదని తిరస్కరించునే!

వసం—వెఱ్ఱిదానా!

కం॥ తిండికిఁ దిప్పలఁబెట్టుచు
దండింపఁగఁజేసి యెప్పుడు దయితుఁడు దరిరా
కుండఁగ నెప్పటికప్పుడు
గొండెంబులఁజెప్పు సవతి కూరిమిదగునే॥

సత్య—అట్లననేల! సుగుణవతియైన యారుక్మిణికి నేసవతినైన నాజన్మము తరింపదే.

వసం—తెచ్చుకొనిన చెలికింటెఁ దనకుఁదానై వచ్చిన తరుణియెక్కువే

తే॥ గీ॥ నగలు నాణెంబులును లేక నలఁగెదీవు
కూడుగుడ్డలులేకుండఁ గుందెదీవు
మగఁడు నీమాట వినడంచు వగచెదీవు
సవతిపోరున దిగులొంది చచ్చెదీవు॥

సత్య—ఏమయిననుసరే. నందనందన పాదారవిందంబులనే సేవింపఁగోరెద.

వసం—ఒకవేళ నాకృష్ణుండే వలదనిన నీవేమిసేసెదవు?

సత్య—చ॥ వ్రతములసల్పియైన, శతవర్షము లాత్మనుతించియైన నే
కతముదపంబొనర్చి నడుకాననివాసము సేసియైన సం
తతము ధరాసురేంద్రులకు దానములెన్నియొ యిచ్చియైన దే
వతలకు మ్రొక్కియైన శ్రితవత్సలుఁ గృష్ణువివాహమాడెదన్॥

శత—(తనలో) అయ్యో! నెచ్చెలి చెప్పు హితవాక్యములనైన సరకు సేయక కృష్ణునేకాని యన్యుని వరింపనని చెప్పుచున్నదే! నేనేమి సేయుదు.

వసం—చెలీ! నీకింత కష్టమేల!

ఉ॥ చక్కనివాఁడు కోవిదుఁడు సారసనేత్రుఁడు చిన్నవాఁడు న
ల్దిక్కులకేగి రాఁగలుగు దిట్టతనంబునఁ గాలువాఁడు పే
రెక్కినవాఁడు నీవిహితుఁ డేకకులస్థుఁడు శౌరికెందులోఁ
దక్కువకానివాఁడు శతధన్వునిగూడి సుఖింపరాదఁటే॥

శత—[తనలో] ఆహా! ఈచెలి నాగుణంబు లెంతచక్కఁగా వర్ణించి నది. సాత్రాజితికిప్పుడైన నామీఁద బుద్ధితిరుగకుండునే!

సత్య—మాధవాసక్తురాలైన యీలేమ యన్యుల నెట్లుకోరఁగలదు!

సీ॥ భానుమండలదీప్తి భాసిల్లుచక్రంబు
వనవహ్నిలోనుండ మనసుపడునె
లేమావిగున్నపై లీలమైవిహరించు
పికము బర్బురముపైఁ బ్రేమపడునె
అరవిందమకరంద మానఁగోరెడు తేఁటి
యర్కపుష్పంబుల కాసపడునె
క్షీరవారాశిలోఁ జేరియాడెడుహంసి
లవణాబ్ధికేగ నుల్లాసపడునె
గీ॥ దాడిమంబులపైనుండఁ దలఁచుశుకము
వటఫలంబులభుజియింప వాంఛపడునె
సకలభువనాళి రక్షింపఁజాలు కృష్ణుఁ
గోరునీలేమ యన్యులఁ జేరఁజనునె॥

వసం—చెలీ! సాత్రాజితీ!

తే॥ గీ॥ తిండికేనియుఁ గొంపకుఁ దిరిగెరాక
దొంగవలెఁబోయి యిల్లిల్లుఁ ద్రొక్కచూచి
గోపికలఁగూడమరగిన గొల్లవాని
వలచి నీవేమి సౌఖ్యంబుఁ బడయఁగలవె॥

సత్య—చెలీ! కృష్ణుండన నెవ్వరని యిట్లాడుచుంటివే! కంసాది దుష్టదైత్యాధముల సంహరించి ధరాభారంబుడించి, యాగంబులరక్షించి ధర్మంబుల సంస్థాపించి లోకోద్ధరణమొనరింప శ్రీమన్నారాయణాంశచే జన్మించిన యవతారమూర్తియని యెఱుంగవే! వేయేండ్లు తలక్రిందుగాఁ దపంబాచరించు మునీంద్రులకయినఁ గర్మయోగులకయిన, జోగులకయిన, విరాగులకయిన, బుధులకయిన, జ్ఞాను

లకయిన, సిద్ధసాధ్యకిన్నరకింపురుషాది దేవగణంబులకయినఁ గనఁగ ష్టమగు నాదివ్యమంగళమూర్తి, యాసద్యశస్ఫూర్తి, యాధర్మ మార్గానువర్తి యానిగమాంతరవర్తి యాలోకైకచక్రవర్తి యా యవతారమూర్తి పుణ్యవశంబున నాభర్తయగునేని నాకేమి కొఱఁ తయగునె! నాకష్టైశ్వర్యంబులు గలుగవే? ఐహికాముష్మిక సుఖం బులు ప్రాప్తింపవే? అట్టి మహనీయుని దొంగయని దూఱెదవేమే? అతం డెంతటిమహత్తుగల దొంగయో తెల్పెదను వినుము.

సీ॥ జ్ఞానేంద్రియంబున న్గనకున్నఁ గనరాని
దురితదూరుండైన దొంగయతఁడు
భక్తిచేత నెకాని బంధనంబులఁబట్ట
దొరకకుండెడు పెద్దదొంగయతఁడు
తరచిచూచినఁ దల్లిదండ్రులుఁ జుట్టాలు
దోఁబుట్టువులు లేని దొంగయతఁడు
నిత్యుడై యెల్లెడ నిశ్చింతవిహారించి
దుష్టదైత్యులఁద్రుంచు దొంగయతఁడు
పరధనము బల్మిఁగొనకుండ భక్తవరుల
దురితముల నెల్లహరియించు దొంగయతఁడు
దొరలు దొంగలు నతిభక్తితోడఁ గొలువ
దొడ్డమాయను జగమేలు దొంగయతఁడు॥

వసం—[తనలో] శతధన్వుని మాయోపాయంబులఁజిక్కి యెంతటిపా పంబున కొడిగట్టుకొంటిని. [ప్రకాశముగ] చెలీ! కృష్ణుం డింతటి మహాత్ముండని యెఱుంగక నేనాడిన పాపోక్తుల మన్నింప వేఁడెద.

సత్య—నీపాపముగాని నీపాపోక్తులుగాని మన్నింప నాపతితపావనుఁ డైన కృష్ణుండే సమర్థుఁడుగాని నావలన నేమియగునె. దోషపరిహా రార్థముగ నామహానుభావునికడకేగి భక్తిపూర్వకముగా నాపుణ్య మూర్తిని సందర్శించి నమస్కరించి నామాటలుగా నిట్లనుము.

సీ॥ తనమామ వధియించి తలిదండ్రులను బ్రోచు
నందాత్మజునకు వందనములనుము
ప్రణమిల్లి ప్రార్థించు పడఁతిఁ గాచినయట్టి
యబ్జనాభునకు జోహారులనుము
భువనభారముఁ బాప నవతారమెత్తిన
నళిననేత్రునకు దండంబులనుము
బృందారకుల సేవ లేప్రొద్దుగొనుచుండు
పురుషోత్తమునకుఁ గైమోడ్పులనుము

గీ॥ తననె మదిలోన నమ్మిన దాననుము
పంచశరు తాపమునఁజిక్కి బ్రతుకననుము
వనితరక్షించుభారము తన దెయనుము
కృష్ణుఁగొనిరమ్ము వేవేగ నింతిచనుము॥

[వసంతిక నిష్క్రమించును].

సత్య- [అంజలి మోడ్చి భక్తితో సూర్యునుద్దేశించి]

ఉ॥ తమ్ములఁ బెంచి భక్తసముదాయముగాచి వినాశహేతు భూ
తమ్ములఁ బాఱఁదోలి సతతంబుఁ ద్రిమూర్తులయంశగాంచి చ
క్రమ్ములనేలి ప్రేముడి నఖండచరాచరపంక్తికెల్ల జీ
వమ్ములనిచ్చు సూర్యభగవానుఁడ కృష్ణునిభర్తఁ జేయవే॥

[కన్నులుమూసి ధ్యానించుచుండును]

శత—[స్వగతము] ఈచెలితోడ సంభాషించుట కిదియే మంచితరుణము. పలుకరించిన నేమగునో! పలుకరింపకున్న నామనోగతం బెట్లు తెలిసికొనఁగింపనగు? చల్లకేగి ముంతదాఁచుకొనవచ్చునే! [సమీపించి] చెలీ! చెలీ! [అని పిలుచును]

సత్య—[మేల్కాంచి] ఎవరక్కడ!

శత—మ॥ వనితా! నీముఱిపెంబు నీమహితలావణ్యంబు నీలీల నీ
తనుసౌందర్యము నీహొయల్లనుచు మోదంబంది మోహించి నీ
చెనువుం గోరి తపించు నా సరసుఁ డా క్ష్మాపాలుఁ డా వీరుఁ డా
ధనికుం డా సుగుణాఢ్యుఁ డా విబుధుఁ డా ధన్యుండు వీఁడేసుమీ!

సత్య—ఈ యారామంబునకు నిన్నెవ్వరు రమ్మనిరి.

శత—మదనుఁడు.

సత్య—ఛీ! పొమ్ము.

శత—మ॥ జలజాతాప్తముఖులై మనోహరములై సంభావనీయంబులై
పలపుందీవియలై విలాసనిధులై భావప్రపూర్ణమ్ములై
విలసత్కాన్తిపరీత విభ్రమములై నెల్లొందు నీకన్నులన్
నెలఁతా! నన్ననకుండ దూఱెఁ జను నే! నీ కేనుశత్రుండ నే!

సత్య—శా॥ ఔరా! యింతటిసాహసంబు తగునా! యారామమధ్యంబునన్
సారంగాలక లాటలాడు తఱిఁ జెంతన్ జేరి యిట్లాడుదే?
లేరే నీకెవరాఁడువాండ్రు? చెలులీలీలన్ గనన్ నవ్వరే?
నీరేజాక్షులఁ బిల్చి చూడు మిదిగో నిన్నేమిచేయింతునో॥

శత—చెలీ! నీమైత్రిఁ గోరి యహోరాత్రంబులు దపించుచుండిన నీదాసునిపై నీకింతయాగ్రహ మేల! శతధన్వుండు నీయెడల నేమి యపకృతిగావించె!

మ॥ ననుగన్నంత నె మోముద్రిప్పి యటుపై నామాటవిన్నంతనే
కనుబొమ్మల్ముడివైచి కన్నులను రక్తచ్ఛాయఁ గల్పించి మో
వినిమున్ బంటనునొక్కి బాల! శిరమున్ వేమాఱుఁ బంకించి యా
ల్కనునన్నేఁ జెదవేల! చేతనయినన్ గంజాస్త్రి వారింపవే॥

సత్య—వచ్చినతోవనే చనకున్న నాజనకునితోఁ జెప్పి నీచెంపలు వాయఁ గొట్టించెద.

శత — నీతండ్రి నిన్ను నాకిచ్చి వివాహంబు గావించెదనని చెప్పియుండలేదే?

సత్య — పాపము, నీతోడ బొట్టుకాటుక పెట్టి చెప్పెఁగాబోలు. అటులైన నీదొంగ యేడుపేల!

శత — చెలీ! కృష్ణుఁ డేకాంతంబునఁ జనుదెంచి నిన్నుఁ గొనిపోవఁ బ్రయత్నించుచుండెనని తెలిసి నామనోగతం బెఱింగింపవచ్చితి.

సత్య — [సంతోషముతో]

ఉ॥ అంతటిపుణ్యమబ్బ నళినాక్షుఁడె నాకడ కేగుదెంచి య
త్యంతదయాంతరంగుఁడయి దాఁగ నన్ను వరింపనున్న ని
శ్చింతగ వాని నాపతిగఁ జేకొని శీఘ్రమె పెండ్లియాడెదన్
సంతసమంది యెప్డు నుపచారము లర్పెదఁ; బూజసేసెదన్॥

శత — స్వాతివర్షమునకు ముత్తెపుఁజిప్పలరీతి నీముఖచంద్రుఁ గాంచ నువ్విళ్ళూరుచుండు నీశతధన్వునిపై నీకెందులకింతకోపము?

చ॥ తరుణి నినున్ వరించు శతధన్వుని మాలుచు గోపబాలు నా
దరమునఁ బెండ్లియాడఁ బ్రమదంబది యేటికి! గొల్లదానవై
శిరమునఁ జల్లముంతలిడి సిగ్గఱియమ్ముచు వాడవాడఁ గ్రు
మ్మరమనసాయెనే! పసులమందలఁ గావఁదలంపు పుట్టెనే॥

సత్య — శ్రీకృష్ణుఁ జేరి నేఁ జల్లనమ్ముకొనిన నీకేల! పసులఁ గాచుకొనిన నీ కేల!

శత — కృష్ణుండనఁ బడిచచ్చెద వేమి? అతఁడు నీకేమిత్రవ్వి తలకెత్తెను! నేనేమి విషముఁ బెట్టితిని!

ఉ॥ నల్లనివాఁడఁ గాననియొ? నారులచీరెలు సంగ్రహించి నే
నల్లరిసేయలేననియొ? ఆవులఁ గావఁగ నేర్వనంచునో?
గొల్లలవెన్నదొంగిలెడు కోర్కులు నా కుదయింపవంచునో?
కల్లలనాడలేననియొ! కాంత! ననున్ మదిఁగోరకుంటకున్॥

కృ—అందు చేతఁగాదు.

చం॥ బలిమి నెలంతలన్ గొనఁగఁ బొల్పడు మూఢుఁడ వంచు విష్ణుమా
యల గ్రహియింపఁజాలని మదాంధుఁడ వంచు మురారి కెందులోఁ
దలఁచిన సాటిరాని గుణధాముఁడ వంచు యథేచ్ఛ ప్రాణిమి
త్రుల నెడఁబాపు ప్రజ్ఞగల క్రూరుఁడ వంచు వర్ణింప దుర్మతీ॥

శత—ఓ సాత్రాజితీ! నీవు చెప్పినది కొంత వాస్తవమే! కృష్ణునకు నే నెట్లు సాటిరాఁగలుగుదును.

సీ॥ మానాభిమానముల్ మంటఁగల్పుచుఁ బొట్ట
కూటికిఁ బొరుగిండ్లఁ గూల్పఁగలనె
స్తన్యమీయఁగఁ బ్రేమఁ జనుదెంచు జవరాలి
జంకుగొంకును లేక చంపఁగలనె
వేవేలుగాఁ జేర్చి ప్రేవెలందులతోడ
వ్యభిచార మొనరించి బ్రతుకఁగలనె
తలిదండ్రులీనట్టి తరుణిఁ గైకొని బావ
మఱదినే నొకచెంప గొఱుగఁగలనె

గీ॥ చెలులు గుమిగూడి జలకేళి సలర్చుచుండ
వలువలన్గొంచుఁ జెట్టెక్కి నిలువఁగలనె
కపటవృత్తిని బక్కరక్కసులఁజంపి
దేవదేవుండనని చాటి తిరుగఁగలనె!॥

సత్య—బ్రహ్మజ్ఞానము లేని నీవంటివారలకవి యవగుణంబులుగాఁగన్ప ట్టుచుండిన నవ్వియే శ్రీకృష్ణుం డవతారపురుషుండని వక్కాణించు నుత్తమచిహ్నాలు సుమీ! ఏమిపుటుకపుట్టితివి! ఆఁడుదాననైన నాకున్న తెలివి తేటలైన నీకేల లేవు!

శత—నిలువ కొంపయైన లేని యాగొల్లనిపైఁ బిచ్చివలపుగలిగి నీవేల మోసపోయెదవు.

ఉ॥ కోరినచీరెలన్ నగలు కొమ్మరొ తాల్చి ప్రియాళితోడ శృం
గారవనంబులన్ దిరిగి కాంతలుగొల్వఁగ మేడలందు బం
గారుఁబ్రుదూఁగుటుయ్యెలలఁ గాలముఁబుచ్చుచునన్నుఁగూడిసం
సారము సేసి సౌఖ్యపడఁజాలక కోరెద వేల కష్టముల్॥

సత్య—అన్యోన్యానురాగంబు లేని వధూవరులకు సంసారసౌఖ్యం బెట్లుగలుగు?

చ॥ సిరులనుగల్గియున్నఁ బరిసేవలొనర్పఁగఁ జేడెలున్న నా
భరణములున్నఁ బుష్పచయవాటికలున్న భవంతులున్న సుం
దరికిఁకనన్నిటన్ దగిననాథుఁడుగూడ లభింపకున్న సం
సరణమదెట్లుసల్పు? జనిసౌఖ్యము లెట్లొనగూడుదానికిన్॥

శత—ఆగొల్లలకోడెకానిఁగూడి నీవేమి సుఖపడఁ గలవు!

సీ॥ అభిమానరాశివై యవతరించిననీవు
గోపాలసుతు నెట్లు గొలువఁగలవు
చెలులు బిగ్గఱఁబల్కఁ జీకాకుపడునీవు
సవతితోఁ బోరెట్లు సలుపఁగలవు
శుకపికధ్వనులకే సొమ్మసిల్లెడునీవు
శ్వానార్భటుల నెట్లు సైఁపఁగలవు
పారావతము నైనఁ బట్టఁజాలనినీవు
బలిమిగ్రేపుల నెట్లు నిలుపఁగలవు
తే॥ గీ॥ వివిధసుమకాండ సౌరభాస్వీతవిదిత
లలితశృంగారవనముల మెలఁగునీవు
కటుకరీషాదిదుర్గంధకలితవిపుల
సురభిసమజంబులం దెట్లుతిరుగఁగలవు॥

సత్య—ఇంకఁగృష్ణుని మనుజమాత్రునిగ నెంచుచుంటివా?

సీ॥ చెనఁటిదైత్యులఁ ద్రుంచి శిష్టరక్షణముఁ జేయ
నవతారమెత్తిన యనఘుఁడతఁడు

పదునాల్గుభువనముల్ పనిఁబూని సృష్టించి
పెనిచి త్రుంపఁగఁజాలు వేలుపతఁడు
ప్రళయవేళలనైన భయరహితాత్ముఁడై
తిరుగ నేర్చినయట్టి దిట్టయతఁడు
సంయమీంద్రులకైన స్వర్గవాసులకైనఁ
జిక్కిచిక్కకయుండు జెట్టియతఁడు

గీ॥ దిశలనన్నింటఁ దానయై తిరుగునతఁడు
విమతులకు నెందు దొరకక వెలయునతఁడు
కానరానట్టి మహిమచేఁ గలుషమణఁచి
ధర్మములఁగాచుచుండెడు దైవమతఁడు॥

శత—చాలుఁజాలు. దొంగవాని దైవంబని యుపన్యసించెద వేమి!

సత్య—జగజ్జేగీయమానమగు మార్తాండరశ్మి యులూకంబునకు నంధకారమై తోఁచినట్లు జ్ఞానులకెల్ల దైవమై కానిపించు శ్రీకృష్ణుండు నీ కన్నులకు దొంగవలెఁ గనఁబడుచుండెఁగాబోలు. అతండు దొంగయైన నేమి! దొరయైన నేమి! ఆమహాత్ము నేకాని నేనన్యుల నుద్వాహమాడఁజాల.

శత—ఏమీ? అతని నేకాని యితరులఁ జేపట్టవుగా!

మ॥ వనధుల్ గ్రుంకవె! సూర్యచంద్రులు నభోభాగంబు వర్జింపరే!
మునులల్లాడరె చిమ్మచీఁకటులు నంభోరాశివ్యాపింపవే
ఘనముల్ గర్జిలకుండునే! ధరణి నక్షత్రమ్ములుర్ రాలవే!
ఘనభూకంపములుప్పతిల్లవె! నినుర్ గంసారి పెండ్లాడినర్॥

సత్య—ఛీ! కృష్ణద్వేషివైన నీకడ నుండరాదు. నీ పలుకుల నాలింపరాదు [నిష్క్రమించును]

శత—[స్వగతము] అక్కటా ఎంతటితప్పిద మొనర్చితిని. ఎంత యవివేకముగాఁ బ్రవర్తించితిని. అల్లిబిల్లిమాటలచే సాత్రాజితీమనంబుఁ

ద్రిప్ప నేరక కృష్ణుని నామోచ్చారణము వినినంత నె పగఁబట్టిన త్రాఁచురీతి లేచి నోటికివచ్చినట్టులెల్లఁ బేలితి నే! తొందరపడువాఁడె న్నటికైన బాగుపడు నే!

రుక్మి—[ప్రవేశించి] బావా! నీమోము వెలవెలఁ బోవుచున్న దేమి?

శత—వివాహలగ్నంబు నిశ్చయించుకొని వచ్చితివా?

రుక్మి—పెండ్లిముచ్చటల నాడఁబోయి దుఃఖాక్రాంతచిత్తుఁడై యున్న సత్రాజిత్తు నోదార్చివచ్చితి.

శత—[ఆత్రముతో] అదియేమి?

రుక్మి—వేటాడఁబోయిన ప్రసేనుని దెగటార్చి శమంతకమణి నెవ్వరో యెత్తుకొని పోయిరఁట.

శత—[ఆలోచించి] మంచిసమయము దొరకినది లే.

రుక్మి—సాత్రాజితి యేమన్నది.

శత—నీవేగినకార్యమెంత నిర్వాహకమైనదో నాయుద్యమంబంత కొనసాగినది. కృష్ణునేకాని యన్యుని వరింపనని చెప్పిపోయినది.

రుక్మి—ఇంకఁగర్తవ్యమేమి?

శత—కర్తవ్యమున కేమున్నది. మనమిప్పుడే సత్రాజిత్తునికడకేగి యతని నోదార్చి కృష్ణుఁడే ప్రసేనునిసంహరించి శమంతకమణి నపహరించెనని నుడివెదము. అంతట సత్రాజిత్తునకుఁ గృష్ణునిమీఁదమాత్సర్యంబుదప్పక కలుగఁగలదు.

రుక్మి—ఔను. అటులఁజేసిన సత్యభామను నీకేయిచ్చి వివాహముఁగావించును. సాత్రాజితియు నిన్నే కోరును. [నిష్క్రమింతురు]

ఇది ప్రథమాంకము.

---

# సాత్రాజితీ పరిణయము.

## ద్వితీయాంకము.

---

[ప్రవేశము: సత్రాజిత్తు, శతధన్వుఁడు. అక్రూరుఁడు.]

సత్రా—అక్రూరా! శ్రీకృష్ణుం డుత్సాహియైయున్నవాఁడె.

శత—మ॥ ధనలోభంబున సచ్ఛమంతకముఁ జెంతన్ జేర్పఁగామించికా
నన మందుండఁ బ్రసేనుమద్విహితు నన్యాయంబుగాఁ జంపిమి
త్రునిరత్నంబనయించునాఖలున కాదుర్బుద్ధి కాధూర్తకృ
ష్ణున కుత్సాహము లేశమైన శతధన్వుండుండఁ బ్రాప్తించునే?

అక్రూ—సత్రాజితులారా! చెవులు మూసికొనెదరేమి! నేనాడెడు మాటలు మీకుఁ గర్ణకఠోరములై యుండెనా!

అక్రూ—మిత్రమా!

చ. దనుజులసంహరించి తొలిధర్మములన్ నడిపించి సత్తపో
ధనులను బ్రోవ నెంచి యవతారముదాల్చిన యాదిమూర్తి పా
వనబుజుమార్గవర్తి యనివార్యదయామయకృష్ణమూర్తి నీ
వనినటులన్ బ్రసేనుఁదునుమాడి శమంతము దొంగిలించునే॥

శత—[పకపకనవ్వి] పిచ్చివాఁడా! నిరంతర నారీలోలుండగు నాకృష్ణమూర్తి ధర్మోద్ధారణమొనర్ప నవతరించిన యాదిమూర్తియెట్లగును.

అక్రూ—[తలపంకించి] ఏమేమీ! నేఁబిచ్చివాఁడనా!

చ॥ దనుజులగీటణంప నవతారముఁదాల్చిన శౌరియంచు నా
తనిపదసేవఁగోరుచు గతాగతముల్ దమదివ్యదృష్టిచేఁ
గనుఁగొనఁజాలు తాపసశిఖామణులుంద బుధులుంద మఱెందఱో
యనుదినమేగి కృష్ణునకు నంజలిమోడ్చఁగఁబిచ్చివారలే!

శత—నీవనిన తపోధనులు నిజమైన తాపసధురంధరులేని, బుధులు నాకనివాసస్థులేని దైత్యాధములఁ జెండాడ వారికడమహత్వంబు కలవయ్యనే! లోకవంచకుండైన యాకృష్ణునికడకేగి వారేల మొక్కుకొనవలయును!

సత్రా—నీవనినయటుల భగవదంశచేఁ గృష్ణుండు జన్మింపకుండినను శరణాగతరక్షకుఁడై, యాడినమాటతప్పని దయామయుండైనయా కృష్ణమూర్తి నిర్నిమిత్తముగ మన ప్రసేను నేలపరిమార్చును!

తే॥ గీ॥ ధర్మనిరతుండు సరసుండు ధార్మికుండు
ప్రథితనిష్టాగరిష్ఠుండు బాంధవుండు
భక్తజనవత్సలుండు మత్ప్రాణసఖుఁడు
భ్రాతృఁజంపునె కరుణయావంతలేక !

రుక్మి—ఏమీ! కృష్ణుండు దయామయుఁడా! మామనుఖండించిన ఘాతుకుఁడే దయామయుండైనఁ గానివారెవ్వరు ?

అక్రూ—మేనమామయైననేమి! మేనత్తకొడుకైననేమి! సాధుల బాధించు దుండగీఁడెవఁడైన వధ్యుఁడుకాఁడె! కృష్ణుండట్టిదుర్మార్గుల సంహరించుఁగాని ప్రసేనునివంటి సత్పురుషుల నతం డేల తెగటార్చును !

శత—ద్రవ్యాపేక్షకులగువార లెంతటిదుష్కార్యంబులనైనఁ జేయసాహసింపరే !

ఉ॥ తమ్ములఁజంపిరైన నడిదారులఁ బాంధులఁగొట్టిరైన జూదమ్ములనాడిరైన బెడిదంబుగ లంచములందిరైన సా

త్యమ్ములనిచ్చియైనఁ దమకన్యల నన్యుల కమ్మియైన దా
స్యమ్ములసల్పియైన ధనమార్జనసేయరె ద్రవ్యకాంక్షులౌ॥

సత్రా—ఉచితానుచితపరిజ్ఞానశూన్యులై మానాభిమానంబుల విడిచి ధనమార్జింపవలెనని త్రొక్కులాడువార లటులఁజేసినఁజేయుదురు గాక! కృష్ణుం డట్టి నీచకృత్యంబులకు లోఁబడునే!

కం॥ పెరసతులు దల్లులంచని
పరధనముల కాసవడక పరిపంథులనుఁ
శరణన్నఁ గాచు కృష్ణుఁడు
హరి మణికిఁ బ్రసేనుఁజంప నరుగునె వనికిఁ॥

శత—కృష్ణునిపై నపనిందమోపిన నీవు నాకుఁ ద్రవ్వి తలకెత్తున దేమున్నది! నీతమ్ముని ఖండించి నీమణిని సంగ్రహించినవానిపై నీకింత ప్రేమాతిశయంబులుండ నడుమను నాపుట్టియేమిమునిగినది మణినేకాకుండ నీకన్యామణిని సహితము వానికేకట్టిపెట్టుము.

రుక్మి—చాలుఁజాలు. ఆపాపికి సాత్రాజితినిగూడ సమర్పింపవలయునా!

తే॥ గీ॥ పిల్లపై బిల్లనిచ్చుచుఁ బెండ్లిసేయఁ
గృష్ణుఁబోలినమగవాడు పృథ్విలేడె
అనుజుఁడునుమాడి మణిగొన్న యతనికెటులఁ
జేడెనిచ్చెదు నీతండు సిగ్గులేక!

శత—తమ్ముఁడు చచ్చిన నేమి! పిల్లచచ్చిన నేమి! కృష్ణుండల్లుఁడైనఁ జాలుఁగదా!

రుక్మి—అయ్యయ్యో! మారుక్మిణిపకు నగచాటులైన సత్రాజిత్తు కనివినియుండ లేదె!

తే॥ గీ॥ ఎపుడు స్త్రీలోలుఁడై యుండి యెగిరిపడుచు
నేల నెచ్చోఁట బెత్తెడు నేలలేక
పరులపంచలఁబడి యుండువానికకట
బిచ్చమెత్తఁగనిచ్చునె మచ్చెకంటి!

సత్రా—కృష్ణునిలావు నేనెఱుంగనిదియా ! మీబలాబలంబులు నే నెఱుంగనివియా? నిజమారయ నిట్లంటేఁగాని మిమ్ములఁగాదని నేఁజేయున దేమున్నది.

రుక్మి—(తనలో) అమ్మా ! ఇప్పటికి సత్రాజిత్తు మాత్రోవకు వచ్చుచున్నవాఁడు.

శత—కృష్ణునియందలి యభిమానంబుచేఁగాని చచ్చి పడియుండిన నీ తమ్మునిమీఁది మాత్సర్యంబుచేఁగాని నీవూరకుండిన నీశతధన్వుండు హితుని మరణంబునకుఁ బ్రతీకారం బొనర్పకుండునే ?

అక్రూ—కృష్ణుఁ బరిభవింప సుకరంబని యోజించుచుంటివా!

తే॥ గీ॥ దండిబలమున నీతలదన్నినట్టి
దనుజవరు లెంద ఱేని శ్రీధవునెదిర్చి
సమరముఖమున ధృతివీడి చావలేదె
అట్టి దేవకీసుతు గెల్వనగునె నీకు॥

శత—హితునికై పోరాడి యీతుచ్ఛశరీరంబుఁ గోల్పోయిన నేమి?

సత్రా—మిత్రుండన నీవే మిత్రుండవు !

తే॥ గీ॥ కలిమిలేముల నొకరీతి గలసిమెలసి
చచ్చినసఖుని మఱవనిసచ్చరిత్రు
మిత్రుఁడని లోకచక్రంబు మెచ్చుఁగాని
అన్యదెస మిత్రనామంబు సార్థకంబె॥

ఓరోరి కృష్ణా ! యదుకులసంభవా !

ఉ॥ ఎవ్వరికేని నెగ్గు మునుపెన్నఁడుఁజేసి యెఱుంగనట్టి నీ
వెవ్విధి పాపకర్మముల కిప్పుడుపాల్పడితోరి ! యెట్లు దా
దవ్వుల మాప్రసేనుఁగని తార్కొని చంపఁగఁజేతులాడె ! నీ
నెవ్వగ నెట్టుసైపఁగల ! నీచ ! దురాత్మ ! మదంబు హెచ్చెనే?

అక్రూర రుక్మలార ! శతధన్వుండాడిన మాటలు మీరును విని

యుంటిరిగదా! ప్రసేనకుమారుమరణంబు మిత్రుండగుటచే మీకు ననుజన్ముండగుటచే నాకును సమానదుఃఖకారణమే. అందులకు మనమిప్పుడేమి ప్రతిక్రియ నొనర్చెదము.

రుక్మి—దీనికింత యాలోచన యేల? చంపినవానిఁ జంపుటయే కర్తవ్యము.

శత—(స్వగతము) అమ్మా! ఇప్పటికిఁగదా సత్రాజిత్తునకుఁగృష్ణునిపై మాత్సర్యంబుఁగలుగఁజేసితి.

అక్రూ—ఏమీ! కృష్ణుని వధించెదవుగా!

ఉ॥ ఉండఁడె మాగధుండచట నుండఁడె చైద్యుఁడు నీవులేవె! కృ
ష్ణుండు సమస్తరాజులుఁగనుంగొన మిమ్ములఁ జిన్నపుచ్చిమీ
యండజయానఁగ్గొనఁడె? అప్పుడు నూపరెమీప్రతాపముల్
భండనభూమిదైత్యపరిపంథి జయింపఁగ మీకుశక్యమే॥

రుక్మి అయినఁ గృష్ణుఁడే యెల్లప్పుడు విజయుండగునని నీవెట్లు చెప్పఁగలవు? దారపుత్రాదులతో యాదవులను మధురాపురినుండి మా జరాసంధుండు వెడలఁగొట్టినప్పుడు కృష్ణుని మగఁటిమి యేమైనది?

తే॥ గీ॥ కర్మపరి పక్వమునఁజేసి కాలగతిసి
హర్షశోకమ్ములు శరీరి కమరుఁగాని
దేహధారి స్వతంత్రుఁడై తిరుగఁగలఁడె
కలిమి లేములనరలింపఁ గలఁడె నరుఁడు?

సత్రా—రుక్మీ! శతధన్వా! కయ్యంబునకు మనమిప్పుడే కాలేల్రదవ్వ వలయును? కృష్ణుండు మిక్కిలిదురభిమాని. కృష్ణుండే మనప్రసేనుఁ దునిమి శమంతకమణి నపహరించెనని నాతఁడే తలయెత్తితిరుగఁ జాలక దేహంబుఁ బరిత్యజించును.

రుక్మి—సమస్తధరావరలోకంబు వీక్షించుచుండ రక్కసివలె రాజీవాక్షిఁగొనిపోయిన మనుష్యాధముం డిట్టిపలుకులకెబొందివిడుచునా?

సత్రా — అటులఁగాదు.

క॥ అరిది శమంతముఁ గృష్ణుఁడె
హరియించిన సిగ్గుచేతఁ నాతఁడెయిాల్గుఁగ్
హరిమణి నెఱుగమి దిక్కుల
నరయుచు సాధించి యిచ్చి యశముగణించుఁ॥

అందుమీఁద నిజానిజంబులు బయల్పడఁగలవు అప్పుడు మణినిసప హరించినఁ గృష్ణునకుఁ గాని లేక నిష్కారణముగా నపనిందమో పిన మనకుఁగాని గర్వభంగము కాఁగలదు.

అక్రూ — ఔను. అటులఁజేయుటయే నా యభిమతము.

శత — మామా! మీాయిచ్చవచ్చినట్లు నడచుటకీ శతధన్వుం డెప్పుడు సిద్ధముగానేయున్నవాఁడు. కృష్ణునికడకేగి నీకిది యేమిబుద్ధియని నేనిప్పుడే యడిగివచ్చెద. (అందఱునిష్క్రమింతురు)

---

# సాత్రాజితీ పరిణయము.

## తృతీయాంకము.

---

(ప్రవేశము- బలరాముఁడు, సాత్యకి, కౌశికుఁడు, శతధన్వుఁడు)

బల—ధర్మరక్షణపరాయణుండైన శ్రీకృష్ణుండు చింతాభరాక్రాంత స్వాంతుం డెట్టులయ్యె.

మ॥ దనుజుల్ గ్రొవ్వున నాకవాసులపయిన్ దండెత్తిరో! స్వర్గభ
ర్తను బాధించిరొ! యాగవాటికహవిర్భాగంబులిమ్మంచు స
న్మునులన్ గొట్టిరొ! భర్తలన్ దునిమిరో నొప్పించిరో ధార్తరా
ష్ట్రుని చేఁజిక్కిరొ పాండునందనులు! కృష్ణుండాత్మఁ జింతిల్లగాన్॥

కౌశి—నిరంతరయువతీలోలుఁడగు నామహానుభావున కేకన్నియ కంటఁబడినదో?

సాత్య—అవ్విధియుఁగాదు. మిథ్యావాదియైన సత్రాజిత్తుని కావరమే దానికి ముఖ్యకారణము.

బల—అదియెట్లు ?

సాత్య—ప్రసేనుని వధించి శమంతకమణి మన కృష్ణుడే యపహరించినటుల సత్రాజిత్తుఁ డెల్లెడ నుడువసాగె.

బల—శతధన్వా! ఇది నిజమేనా ?

శత—(తనలో) రామకృష్ణులు సత్రాజిత్తుని ద్వేషించునటులఁ జేయ వచ్చినందులకుఁ దగిన సమయ మిపుడే దొరకినది. (ప్రకాశము గా) నిజముగాక మఱియేమి.

కౌశి—[శతధన్వును ద్దేశించి తనలో] అదియేమోకాని వీని మొగముఁ జూచినప్పటినుండియు వీఁడుమిత్రద్రోహివలెఁ గన్పట్టుచున్నవాఁడె.

బల—[క్రోధముతో] ఓరీ! ప్రసేనాగ్రజా! అహంభావహృదయా!

శా॥ ఏమేమీ? మముఁదూలనాడుటకు జంకేమాత్రముఁ లేదె!మా
సామర్థ్యంబు లెఱుంగవో! కనవొ! కంసధ్వంసిపై నిట్టి యు
ద్దామప్రస్ఫుటనింద మోపఁదగునే! త్వద్ధైర్యదర్పోన్నతుల్
మామముందాఁగునె! సాహసంబెటులసంప్రాప్తించెనిందింపఁగాఁ॥

శత—బలరామాదులఁ దృణప్రాయులుగ నెంచకుండిన వాఁడిటులఁ బలుక సాహసించునే

కౌశి—శతధన్వా! అతఁడు నీప్రియమిత్రుండు కాఁబోలునే. నీవైన నేల బుద్ధి చెప్పవైతివి!

శత—కౌశికా! ధనవిహీనులకు ధనమబ్బిన నల్పుల కధికారము సంభవించినను బాలురకు రాజ్యాధికార మేర్పడినను హితవాక్యంబుల సరకుసేయుదురా?తమయొజ్జలనైనఁగన్నెత్తిచూచి పలుకరింతురా?

బల—[సత్రాజిత్తు నుద్దేశించి క్రోధముతో]

మ॥ ఖలుఁడాశ్రేష నొనర్చితో! మతిచెడఁగ గంజాయిగ్రోలితివో
బలవంతంబగు గాలిసోఁకెనో! సురాపానంబెమైద్రిప్పెనో!
తులువా! యట్లుఁగాకయున్న ననుజుఁ దూషింతువేనీవు? లో
కులునిందున్గలనిక్కముఁ గనిన నీకుఁ నిల్వఁదావుండునే!॥

శత—నిజానిజంబులు లోకు లెఱింగిన పిదప వానికి నిలువదావున్నను లేకపోయినను మీమిత్రుండనని పేరుపెట్టుకొనిన నాకేతలయెత్తి తిరుగ సాధ్యముగాకున్నదే!

మ॥ కలుషాత్ముండనినల్లొ నల్వురును వక్కాణింతురేకాని యిం
దలిసత్యంబు గ్రహింపరైరి తలువన్ దండింపరై రెవ్వరున్
కులగోత్రమ్ముల నెంచకీపగిది వాగ్రువ్వంగఁ జేకొన్న యా
ఖలుశిక్షింపమి మీకు మీయశమికన్ గాపాడవీలుండునే॥

కౌశి— ఓయీ! శతధన్వా! నీవాగ్ధోరణిఁజూడఁ గృష్ణసత్రాజిత్తుల నడు
మఁదంపులఁ బెంచి వినోదింప వచ్చినటులున్నదే.

శత—[తనలో] నాయుద్యమమీతఁ డెఱింగెనాయేమి? [ప్రకాశము]
కౌశికా! నీబ్రాహ్మణ చాపల్యఁపు మాటలఁ గట్టిపెట్టుము.
పొట్టకూటికై చేరిన నీకుఁ బాయసముకావలెఁగాని యింత రాజస
మెందులకు ?

కౌశి—పాయసముగాని రాజసమక్కరలేదేమి? కన్ను మిన్నెఱుంగక
నేనెవరయినదెఱుంగక గ్రుడ్డువచ్చి పిల్లను వెక్కిరించు చందమున
మాట్లాడెదవేమి?

శత—బలరామునిచెంత నుండుటచేతను, బ్రాహ్మణుండవు గనుకను
నీదుండగము క్షమింపవలసి వచ్చుచున్నది.

కౌశి —[పక పక నవ్వి] లేకుండిన వెంటనే చప్పటులఁగొట్టి చప్పరించి
యుందువుఁ కాబోలు. నీ మిడిగ్రుడ్లుచూచి నీ ప్రేలుడువిని జడియు
టకు నే నాఁడుదాననుకొంటివా?

శత—అట్లనుకొనలేదు. పొట్టబట్టినయంత నెయ్యిత్రాగి వీధులవెంటఁ
బొర్లాడు తిండిపోతువని తలంచితి.

కౌశి—కుక్క మొఱిఁగినరీతి నీవింక మొఱిగెదవేని యీబుడ్డిచెంబుతో
నీతలఁ బగులఁగొట్టి యీ జందెంబుల నీ మెడఁజుట్టి వాగకుండఁ
నోరు మూయించెదఁ జుమీ!

శత—కౌశికా! నల్లమందుమత్తుచే మైమఱచితివా? లేక యిది వంట
సాల యనుకొంటివా?

కౌశి —కల్లుఁద్రాగి తచ్చనలాడుచుంటివని తలంచితి.

శత —[క్రోధముతో] ఆకూఁత నురలఁగూయుము.

[కత్తిదూసి కౌశికుని మీఁదికిఁబోవును.]

బల --[ఇర్వురను వారించి] శతధన్వా! క్రోధాయత్తచిత్తుండవై యీ బ్రాహ్మణునిమీఁది కీవేలపోయెదవు. కౌశికా! నీవూర కుండుము.

కౌశి —రామా! రానిమ్ము. ఈ పంచాంగపుఁగట్టతో వీఁపుమీఁద నాలుగు చేఱపులు చఱచి వీని పంచప్రాణమ్ముల నొప్పించెద.

బల —వయస్యా! మిన్నకుండుము. శతధన్వా! నిన్న మొన్నదనుక కృష్ణుండు సత్యసంధుండని వచించుచుండిన లోకులును సత్రాజిత్తు పక్షమవలంబించిరే!

సాత్య —నిర్నైతుకముగా నపనిందమోప సాహసించిన దుర్మార్గుని దూఱవలెఁగాని లోకుల దూషింపనేల!

కౌశి —శతధన్వా! ఇంకెగరకుము. అదిగో? మాకృష్ణుండిటు వచ్చుచున్నవాఁడు.

బల—[ప్రవేశించుచున్న కృష్ణునుద్దేశించి కోపముతో]

మ॥ దనుజారాతిగురించి దబ్బఱలు సత్రాజిత్తుఁడెట్లాడె! కృ
ష్ణునిమాహాత్మ్యమెఱుంగఁడో! తలఁపడో! చోరక్రియల్గాననాం
తని తమ్ముల్ దునుమాడిదివ్యమణిఁ జెంతల్ జేర్చితీవన్న స
జ్జనులుల్ నమ్మఁగలారె! వెల్వడదొకో సత్యంబు వేయేండ్లకుల్॥

కృష్ణు —అగ్రజా!

మ॥ అనిరల్ నీవిటువానిపై నలుగనేలా! గోపభూజాని కి
మ్మనవో యామణినాఁడు! పిమ్మట నదృశ్యంబైన నాతండు దా
నిని నేనేకొనియుండవచ్చునని సందేహింపఁ దప్పున్నదే?
అనుమానంబొకచోటనుండదొకో! ద్రవ్యంబుండ వేఱొక్కచోల్

బల—చోరభయంబు లేకుండ శమంతకమణిని యాదవనాయక సౌధాంతరసీమయందునిచి దినదిన ప్రవర్ధమానహిరణ్యంబుగొనుమని హితోపదేశంబుఁ జేసినందులకు నీకీయపకృతి గావించుటధర్మమే!

సాత్య—అన్నలారా! కులద్రోహియైనవాని దుష్కృత్యమ్ములగుణించి యీధర్మాధర్మవిచారణ యేల?

మ॥ కులగోత్రమ్ములనైన నెంచకెటులన్ గ్రొవ్వెక్కి వాక్రుచ్చునా
తులువన్ బట్టి వధించి సద్యశము తోడ్తోనిల్ప లేకున్న మీ
బలమింకేటికి ! పాణినాయుధములన్ బట్టంగనింకేల ! యా
ఖలుపక్షంబెవహించి సత్యమును వక్కాణింపరై రెవ్వరున్॥

శత—వత్సా ! పిన్నవాఁడవైనను మాకెల్లరకు సిగ్గువచ్చునటులఁ బలుకుచుంటివే!

కౌశి—శతధన్వా! మాకనియెడవేల ? నాకనుము.

సాత్య—ఉ॥ వానివధింపఁగూడదనుభావన మీకుదయించె నేని నా
కానతియిండు నేనరిగి యాతనిఁ దెక్కలఁ గట్టితెచ్చి య
జ్ఞానతమోభరంబు దిగఁజారఁగఁ జెంపలువేసి పంపెదన్
మానమువీయఁదల్పెడు మానిసిఁజంపినఁ బాపమున్నదే॥

కౌశి—ఇంక మీరుపేక్షించిన యెడల యమదండమువంటి నా వెదురుకఱ్ఱతో వాని తలసహస్రశకలంబులఁగావించి యాసత్రాజిత్తునకు, నాతని మిత్రుండగు నీశతధన్వునకును బుద్ధి వచ్చునటులఁ జేసెదను.

కృష్ణు—వయస్యా ! తమ్ముఁడా ! మన మిప్పు డీరీతి నాచరించితిమేని జనులందఱు వానిపలుకులనే విశ్వసించి మనల దూఱనారంభింపరే! మణిని సాధించి యపనిందఁ బాపుకొనఁ బ్రయత్నింపవలెఁ గాని సత్రాజిత్తుని వధించిన మనకేమియశము చేకూరును.

కౌశి—ఆదినుండియు మనశాంతమే మనకొంపద్రవ్వుచున్నయది.

శత—ఎవ్వరో యెత్తుకొనిపోయిన మణిని నీవెట్లు సాధింపఁగలవు?

బల—శతధన్వా! కృష్ణునకు సాధ్యముకాని కార్య మొకఁటి గలదా!

కౌశి—(తనలో) క్రొంపద్రవ్వి పీఁడెత్తుకొని పోలేదుగదా? ఈదేబె కింత తెలివియా! (ప్రకాశముగా) నీయంతటి మిత్రుండుండఁ గృష్ణుం డేపని సాధింపఁజాలడు.

శత—ఏమిచేసినను నీవంటివేడుక చెలికాఁడు సేయవలెఁగాని నావంటి మిత్రుం డేమిసేయఁగలఁడు?

కౌశి—ఇచ్చకములాడి క్రొంపలనార్పఁగలఁడు.

కృష్ణు—మిత్రమా! నీకీసంశయమేల?

ఉ॥ కాంచెద నెల్లదిక్కులఁ; జెగల్చెదలోకచయంబు వార్ధులిం
కించెద; శత్రువర్గముల గెంటిజయించెదఁ; గూపముల్ పరీ
క్షించెద గోత్రగర్భములఁ జించెద; దివ్యశమంతకంబుసా
ధించెద; నింబసూనునకుఁ దెచ్చి యొసంగెద నిందడిందఁగాన్॥

శత—ఏమో! ఏమి తెచ్చెదవో! జరాసంధాదులఁగూడి నీపైనదండువిడువఁ బ్రయత్నించుచుండిన సత్రాజిత్తునితోఁ బోరెదవా! మణినే సాధించి తెచ్చెదవా?

బల—జరాసంధాదు లరుదెంచిననేమి? ఫాలాక్షుండెత్తివచ్చిననేమి? ఎట్టులైన మణిసాధించి సత్రాజిత్తునకుఁదగిన బుద్ధిచెప్పకవిడువము సుమీ!

కృష్ణు—మిత్రమా! శతధన్వా!

మ॥ ధరణీగర్భముగ్రుంగినన్ బవనుఁడంతర్ధానమైపోయినన్
జరమాద్రిన్ జలజప్రియుండోడమినన్ సప్తాంబుధుల్ బ్రుంగినన్
స్థిరగోత్రావళి దద్దరన్ దిరిగినన్ దిగ్దంతులల్లాడినన్
దిరుగన్ నేరని మత్ప్రతిజ్ఞ నిపుడే నేనేగి చెల్లించెదన్॥

(అందఱు నిష్క్రమింతురు)

# సాత్రాజితీపరిణయము.

## చతుర్థాంకము.

---

(జాంబవంతుని పర్వతము.)

కృష్ణు——బళిరే! ఈనగరాజ మెంత రమణీయముగానున్నది!

మ॥ స్ఫుటమై గైరికధాతు కాంతిమయమై భూజవ్రజాకీర్ణమై
దిటమై యున్నత శృంగమై యచలమై దివ్యౌషధీ స్థానమై
కటక ప్రస్రవనిర్ఝరౌఘయుతమై గండోపలాగారమై
చటులోగ్రోరగ సత్వసంభరితమై శైలంబు రాజిల్లెడున్॥

(గిరినివిలోకించి) దరీద్వారంబున నుండి ప్రజ్వరిల్లుదిగంత దంతురంబైన యీ యుజ్వలకాంతి యేమై యుండును!

మ॥ శతమార్తాండ కరప్రభాభరణ చంచద్భూరిరుద్ధామమై
తతమాణిక్య రుచిప్రపాటితగుహాంతర్భాగగాఢాంధమై
సతతోద్భూత సువర్ణకాంతి మయపూజ్యప్రాంతభూభాగమై
ప్రతిభాచ్ఛాదిత దృగ్విలాసమగు భాస్వత్తేజమేమోకో!

(గుహను బరీక్షించి) ఆహా ! ఏమి నాయదృష్టము !

మ॥ ఘననిందాస్పద సచ్ఛమంతకమణిన్ గన్గొందిన్ గోరి కా
ననసీమన్ దిరుగాడి నేడమిత దైన్యంబందుచున్ జాంబవం

తు నివాసంబునకేఁగ దానిఁగను సంతోషంబు చేకూరె; మ
ర్త్యునియత్నంబున నెట్టిసాహసఁపుఁగోర్కుల్ గాని యీడేఱవే!

దాది—"దొంగ దొంగ" (అని యఱచును.)

జాంబ—(కోపముతో)

మ॥ సరసీజాప్తునిరశ్మియైన విలసచ్చంద్రాతపంబైన శ్రీ
హరియైనన్ గనరానిమద్బిలము డాయన్ వచ్చినీవేల త
స్కరవృత్తిన్ జొరఁబాఱ నెంచితివి! లేశంబున్ వినన్ లేదె భీ
కరభల్లూకవరోజ్వలప్రథితదోః కాఠిన్యమీ వెప్పుడున్॥

కృష్ణు—వనచరధీర!

మ॥ ధనలోభాన్వితనీచమానసుఁడనై ధర్మంబు వోనాడి య
న్యునిసొమ్మంచును లేశమైన మదిలోనూహింపలేకుండ నే
మనుచున్ దొంగిలియాశమంతకము వ్రేలాడింతువుయ్యాలకున్
మునునీవెన్నఁ డెఱుంగవే దనుజనిర్మూలోగ్రచక్రోద్ధతుల్॥

జాంబ—ఓరోరి కపటోపాయధురంధరా! దేవకీగర్భభారభూత!

చం॥ వనతలమందునీమణిని వాతఁగ్రహించుచునొక్క సింగమే
పునః బరుగెత్తుచుండఁ బరిపూర్ణబలంబున దానిఁజంపి దీ
నినిగొనఁజౌర్యమా నె! నవనీతముఁ గొల్ల గొనంగఁజూచునా
తనికిది ధర్మమియ్యది యధర్మమటంచు నెఱుంగ శక్యమే!

కృష్ణు—వృథాకంఠశోషణమేల! రణమొనర్చెదవా! లేక మణినిసమ
ర్పించి సాష్టాంగ నమస్కారంబు లాచరించెదవా చెప్పుము.

జాంబ—ఏమేమీ! రణమియ్యకున్న నీకు మణినిచ్చి నమస్కారం
బొనర్పవలెఁగా!

సీ॥ పదియాఱువ్రక్కలై పడునట్లు పడఁదన్నఁ
బసలేకపడియుండు బండిగాను
క్షణకాలమున నన్నుఁ గసిదీరఁబై కెత్తఁ
జేష్టదక్కినయట్టి శిఖరిఁగాను

మర్దించి పెనుగాళ్ళ మట్టగింపఁదలంప
బలహీనమైన సర్పంబుగాను
బెదిరెంచియదలించి వేధించి తఱుమంగఁ
గసవుమేసెడు నోర్కకదుపుఁగాను
తే॥ గీ॥ స్కందునకునైనఁ బాకశాసనునకైన
ధాతకైనను వానిముత్తాతకైన
భల్లమైనట్టి భల్లూకవరుడఁగాని
నీకు జోహారులొనరింపఁ నెలఁతఁగాను॥

కృష్ణు — శత్రుగజకంఠీరవుండగు నీకృష్ణుండుమాత్రము నీబెదరింపులకు జడియుననుకొంటివా!

సీ॥ చెప్పరించిరసంబుఁ జిట్టనదిగ్రమింగ
వనినుండు చిఱురేగిపండుగాను
పరుగులెత్తుచువచ్చి పైపైకి నెగఁద్రాఁక
నచలత్వమున్నొన్న యగముగాను
కసిమసంగెడుశక్తి గ్రక్కున నెగఁబీల్చి
పొలివుచ్చఁ జీమలపుట్టఁగాను
నీరూపముంజూచి నివ్వెరపడిభీతి
నురుకంగ సామాన్యనరుఁడఁగాను
తే॥ గీ॥ కృష్ణుఁడన నెవ్వరంచని యెగిరిపడెదు
చండతరఘోర దుస్సహచక్రధాటి
దైత్యసంహార మొనరించి ధర్మములను
బ్రోవవచ్చిన యవతారమూర్తినేనె॥

జాంబ — ఏమీ! నీవవతారమూర్తివా! (నవ్వి) నీవేయవతారమూర్తివయిన లోకంబులు తలక్రిందుగాకుండునా! అమరావతి లంకాపురిగాకుండునా?

కృష్ణు — మణినిచ్చెదవా! లేకున్న నీదుర్మదము సంగ్రామరంగంబున వదలింపమనెదవా!

జాంబ—స్వసామర్థ్యస్తోత్రప్రియా! దంభోపాయహృదయా! రణరంగం బన నేమనితలంచితివి!

సీ॥ అస్త్రశస్త్రశిక్షితో నరిఁదోలవలెఁగాని
యాలఁగోలనదల్చు నాటగాదు
పోటుబంటులతోడఁ బోరాడవలెఁగాని
యబలలతోడ సయ్యాటకాదు
బలదర్పములమించి నిలుచుండవలెఁగాని
పరుగిడిచెల్లెక్క-వలనుగాదు
సింహనాదమొనర్చి ఛేదింపవలెఁగాని
మురళి శత్రులగెల్వఁ దరముగాదు
గీ॥ వైరిబలమెల్ల వెలిపుచ్చవలెనుగాని
గొల్లపల్లెఁబడి కొల్లగొనుటకాదు
వెన్నదొంగ! వెఱ్ఱివాడ?
సంగరంబేడ! నీబోంట్లు సలుపుటేడ॥

కృష్ణు—భల్లూకాధమా!

తే॥ గీ॥ పగఱసాధింపఁగలిగిన బలములేని
వృద్ధయోధుఁడవనియెంచి యింతఁదనుకఁ
జూచిచూడమిఁ బ్రేలంగఁజొచ్చినావె
శక్తికలదేని సమరంబు సలుపరమ్మ॥

జాంబ—చూచిచూడకక నీవేమిసేయఁగలవు!

మ॥ రణరంగంబున దోఃప్రతాపమున హాహాహాకారిపోరాడు పా
వనకాలంబున నీకుమారతయు మద్వార్థక్యముల్ గానమే!
తృణలీలన్ నినుఁబాఱఁదోలనె యనిన్ జృంభించిపైకొన్న చో
ఘనబాహాబలుఁ మోల బీరములఁ బల్కన్ సిగ్గులేదే మదిన్॥

కృష్ణు—(నవ్వుచు) ఓయీ! నీబలాబలంబులు నేనెఱుంగనివియా? నిన్ను నేనెఱుంగనా?

మ॥ ఖలుఁడై తేయుల రామరావణసమాఘాతంబునందీవు దో
ర్బలశక్తిన్ గెలువంగజాలక భయభ్రాంతుండవై లేవె! నీ
బలమున్ జేవయు నేనెఱుంగనివియా? భల్లూకరాజాధమా!
కలదే నీకొక కోటికిన్ గలుగు సంగ్రామైక సామర్థ్యముల్॥

జాంబ—ప్రేలరి! రణరంగమర్యాద నతిక్రమించి నోటికివచ్చినట్లు వదరెదవేమి! దైత్యాళిదుర్నయమూలవేళనణంచినది లేనిదినిన్నమొన్న కన్నులు దెఱచిన నీకెట్లు తెలియును?

ఉత్సా॥ చిన్నవాఁడవంచునిన్నుఁ జెండకుండవీడినన్
కన్నుమిన్నుఁగానకుండఁ గాఱులాడెదేలరా!
అన్నగారియన్నవైన నాత్మజారివేనియున్
వెన్నుదన్ని ఱొమ్ముగ్రుద్ది బింకమూఁచివైచెదన్॥

(కృష్ణుఁడు, జాంబవంతుఁడు, నేపథ్యమునఁ బోరాడ జాంబవంతునిఁ గృష్ణుడు తరుముకొనివచ్చును)

జాంబ—(కృష్ణునికాళ్ళపైఁబడి అంజలిమోడ్చి)

మ॥ ధరణీజాతను లక్ష్మణున్ గలసి కాంతారంబునందుండి ని
ష్ఠురలీలన్ ఖరదూషణాది దనుజస్తోమంబు ఛేదించి వా
నరులన్ గూడి పయోధిదాఁటచని లంకన్ జొచ్చి పౌలస్త్యకం
ధరముల్ గూలిచి పత్నిఁగొన్న రఘునాథస్వామి రక్షింపవే!

## దండకము.

దేవాదిదేవుండవై నిర్వికారుండవై సర్వభూతాంతరంగప్రచారుండవై యప్రమేయుండవై యాదిమధ్యాంతశూన్యుండవై యద్వితీయుండవై వేదవేద్యుండవై భక్తసందోహ వాంఛాసమూహానుసంధానచిత్తుండవై దుష్టసంహారకార్యార్థ తత్కాలయుక్త స్వరూపుండవై రామచంద్రుండవై కాశ్యపీభారమున్ బాపఁ గృష్ణావతారుండవై యున్న గోపాంగనాచిత్త సందోహచోరా! దయాసాంద్ర! ధీరా! యదుక్ష్మావరా! నిర్మలాకార! యజ్ఞానవారాశిలో మున్గుచున్ యుష్మదర్థోక్తులైనన్ గ్రహింపంగ లేనైతి దుర్భాషలన్ ప్రేలితిన్ దప్పుగావించితిన్ నీదుదాసానుదాసుండ వన్యస్వభా

భావుండ దీనుండ నన్నుఁ గృపఁ జూడవే ! మ్రొక్కులాలింపవే!
నన్నురక్షింపరావే నమస్తే నమస్తే నమః॥

కృష్ణు—అచ్ఛాగ్రణి! నీకింతదైన్యమేల? తొల్లి రామావతారంబున నాతోడఁ బెనుగులాడఁగోరిన వరంబు మఱచితివే?

జాంబ—మహానుభావా! అయ్యది జ్ఞప్తికి వచ్చినదిగాని మీరాకకుఁగ తంబేమి?

కృష్ణు—భల్లూకధీరా ! ప్రసేనునిజంపి శమంతకమణి నేనే సంగ్ర హించినట్లు వచించుచుండినసత్రాజిత్తున కామణి నెట్లులైనసాధించి యిచ్చి యాయపనింద నివారించుకొన వచ్చితి.

జాంబ—(ఆశ్చర్యముతో) ఏమీ! కృష్ణభగవంతునిమీఁదనే సత్రాజి త్తపనింద మోపెఁగా ? అటులయిన నీ శమంతకమణితోడ నాసు తయైన జాంబవతిని భార్యగాఁగైకొనవేఁడెద.

కృష్ణు—అటులనే గ్రహించెద. (అందఱు నిష్క్రమింతురు)

—

# సాత్రాజితీ పరిణయము.

## పంచమాంకము.

### విష్కంభము.

కాశి — అబ్బా! కాలిలో విరిగినముల్లేకాని విరుగనిముల్లు లేదుగదా. అదేమి పాపమోకాని కృష్ణుండెచ్చటఁ గానరాఁడండె. అక్కటా! భక్తవత్సలుండైన లోకబాంధవుని యనుగ్రహంబున సత్రాజిత్తుచే నార్జింపఁబడిన శమంతకమణిని నందనందనుఁడే యపహరించెనని దురాత్ముండైన శతధన్వుం డింకను బేలుచున్నాఁడే! శాపోపహతుండైన చవితిచంద్రుని జూచుటచేతఁగదా యా వసుదేవనందనునకిట్టి నీలాపనింద సంభవించినది! ఔరా! శాపమహిమ! ఎంతటివారినైన బాధించునుగదా ! (ముందుఁజూచి) అదిగో! అనతిదూరంబుననే సత్రాజిత్తుని యుద్యానవనంబు గనిపించుచున్నది! నేవిన్నయటుల దేవకీసుతుఁ డచ్చట నుండెనేమో పరీక్షించెదను గాక! (అని నిష్క్రమించును.)

ఉద్యానవనము - ప్రవేశము - సత్య - వసంతిక.

సత్య — చెలీ! ఈకన్నియపై విరాళిగలిగి యేనాటికైన శ్రీకృష్ణుం డిచ్చట కరుదెంచునే! అమ్మహాత్ముఁ గనులారఁ జూచుభాగ్యం బబ్బి యెప్పటికైన నాకోర్కె లీడేఱునే!

వసం. — నెచ్చెలీ! దీనికై నీవింత విచారపడనేల?

సీ॥ సాంకవామోది! నీ చేనువు సేకుఱకున్నఁ
జిలుకకూఁతకు గుండె చెదరుననఁడె
చాంపేయనాస! నీ సరసఁ జేరకయున్న
భ్రమర ఝుంకృతిస్సైఁప భారమనఁడె
కాలాహివేణి! నీ కరముఁ బట్టకయున్న
మలయానిలునిదాడి నిలుపననఁడె

పూర్ణేందువదన! నీ ముఖము జూడకయున్న
వనజబాణునిబారి బ్రతుకననఁడె
అతనిచెంతకు దూతినై యరిగినపుడె
యిన్ని ముచ్చటలాడిన కృష్ణమూర్తి
సాంద్రతరకీర్తి జగదేక చక్రవర్తి
నిన్నుఁ బెండ్లాడకుండునే నీరజాక్షి॥

సత్య—పూర్వమటులన్నను నాజనకుం డామహానుభావునిపై నునిచిన యపనింద సహించి నన్నిప్పుడు వివాహమాడునె?

మ॥ జనకుం డాడిన మాటలన్ బరులు పూసల్ గ్రుచ్చినట్లెంచి చె
ప్పినఁ బ్రేమన్ విడనాడి నాయెడల గోవిందుండు గోపించునో
ననునిందించునొ! లేక నాచెలిమికానందించి రక్షించునో
మనమం దేమితలంచునో! యిటుపయిన్ మత్సౌఖ్య మెట్లుండునో॥

వసం—నీజనకుండు తప్పిద మొనర్చిన నీవేమి చేసితివి?

సత్య—నేనా నిర్భాగ్యునియింట జన్మించుటయే పెద్దతప్పు.

వసం—రుక్మి మున్నగువార లపకృతిగావించిన రుక్మిణీదేవిని బలరామానుజుండు పరిణయమాడలేదె?

సత్య—రుక్మిణీదేవియంతటి యదృష్టము నాకీ జన్మంబునఁ బట్టునఁటె.

ఉ॥ ఎప్పుడు నామనోరమణుఁ డిచ్చోటికి వచ్చెడు; వచ్చినన్నుఁ దా
నెప్పుడుపాణినిమ్మని యపేక్షగఁ గోరెడుఁ గోరి ప్రేమతో
నెప్పుడుఁ గౌగిలించి మనసిచ్చెడు; నిచ్చి సుమాస్త్రబంటుగా
నెప్పుడొనర్చి యివ్వనితనేలెడు; నేలి ముదంబు గూర్చెడున్॥

వసం—ఆహారవిహారహారంబులనొల్లక నీ విట్లేల తపించెదవు.

సత్య— ఉ॥ హారము లేల? కాననవిహారము లేల? ఫలమ్ము లేల? ఆ
హారము లేల? మేలికనకాంబరముల్ ధరియించు టేల? కా
సారము లేల? పుష్పశరుసాయకపంక్తికిఁ దూలి కృష్ణు నా
కారముఁ గాంచ డెందమున గాసిలుకన్యకుఁ బల్లవాధరా॥

వసం—చెలీ! మగవారలపొందుగోరి మగువలిటుల వలపింపఁదగునే?

చ॥ పొలతివి కావఁటమ్మ! పుప్పుఁబోఁడులు నీవలెఁ బూర్వమెందఱో
వలపునఁ జిక్కిరమ్మ! తమబాళినిటుల్ ప్రకటించిరమ్మ! కాం
తులవలపింపరమ్మ! తమిఁదూలుట లేఁతగదమ్మ! తోఁడికొ
న్యలువిని నవ్వరమ్మ! పరిహాసపుఁ జేతల మానుమమ్మరో॥

నేఁగలవరించినటుల నీయారామముఖమ్మున నీమనోరమణుండుఁ గానవచ్చునేమో పరీక్షించెదము రమ్ము.

సత్య—అవ్వి స్వప్నవార్తలుగదా?

వసం—కలలోనివార్త లెల్లప్పుడుఁ గల్లలగునా? త్రిజట కలరించిన దబద్ధమయ్యెనా! హరిశ్చంద్రునికల తప్పిపోయెనా! దేశకాలపా త్రంబులఁ బట్టి దైవయోగంబులు గలలందుఁ గన్పట్టుచుండవే?

సత్య—అట్లైన నచ్చటగుడిలోనున్న యారామహేశ్వరిని ధ్యానించి పోవుదము (అంజలి మోడ్చి)

ఉ॥ రాణి! జగద్విహారిణి! నిరంజనరూపిణి! కీరవాణి! గీ
ర్వాణి! సతీమణీ! శ్రితవిపచ్చయశోషిణి! నీలవేణి! శ
ర్వాణి! కృపావిభూషిణి! యరాతివిదారిణి! భద్రపాణి! క
ళ్యాణి! దయాంబరాశి మనురాఁ దెరుఁజూపవె! నన్నుఁ గావవే!

( ప్రవేశము - కృష్ణుడు—కౌశికుఁడు )

కృష్ణ—ఆహా! ఈయారామ మెంతమనోజ్ఞముగా నున్నయది!

చ॥ సరసరసాలసాలసుర సాలతమాలసుమహీరుహాళితోఁ
బరభృతశారికాచటకబంభరకీరమయూరసూక్తితోఁ
సరసిజమల్లికామధురసాగణికాసుమనోలతాళితోఁ
సురుచిరమైన యివ్వనముఁ జూచిన నందనమేలచూడఁగాఁ

కౌశి—నందనోద్యానమని పేరుమాత్రమేకాని యందేమున్నది. నత్యే మునకు నాలుగు పోగాకుకాఁడలైన దొరకవు గదా!

కృష్ణ—ఆహా! చూచినకొలఁది యీవనరాజము నాడెందంబున కెన్నియో మహిమాతిశయంబుల స్ఫురింపఁ జేయుచున్నదే! ఎచ్చటఁ జూచినఁ బ్రేమానుబంధ బంధురంబై, యవర్ణనీయ లావణ్యప్రదేశంబై, లక్ష్మీనివాసయోగ్యంబై, హృదయానందకరంబై, శోభిల్లుచుండిన యిట్టి మహత్తరారామంబులఁ జూచియే పెద్ద లెండఱో యహింసాపరమోధర్మ యను నీతినిఁగని పెట్టి యుందురు. భగవంతుండు దయామయుండనియు, సకలాంతర్యామి యనియు, జ్ఞానులు వర్ణించియుందురు. ప్రకృతి సౌందర్యంబునకు మించిన సౌందర్యంబు లేదని సత్కవులు నిరూపించి యుందురు; దేహంబ నిత్యమనియు, జీవుండు నిత్యుండనియుఁ గర్మ పరిపక్వమునఁ జేసి జన్మాంతరము నొందుననియుఁ గర్మఠులు చెప్పియుందురు. ఆనందో బ్రహ్మ యనియు, వేదాంతులు నొక్కి వక్కాణించి యుందురు. వనరాజమధ్యంబుల నిలిచి తపం బాచరించు వారలకు భగవానుండు సాక్షాత్కరించునని జితేంద్రియులు గని పెట్టియుందురు బళిరే! బ్రహ్మజ్ఞానబోధన సాధనమ్ములనఁ బరగు శృంగారవనంబుల నలరారుచున్న యీభరతవర్షంబునకు సరియైన యలంకారసీమ మఱియొకటి గలదా!

సీ॥ శాబకంబులు ప్రేల శాఖలపై దాఁటి
పండ్లు చేకొనియాడు ప్లవఁగగణము
ప్రేమాఱు నెలుఁగెత్తి పిలుచు పిల్లలఁ జేరి
మేఁత పెట్టుచుకీర మిథునగణము
పలురంగుల హొరంగు ప్రకటించు పురివిప్పి
నృత్యంబు సల్పెడు నెమ్మిగణము
ప్రతిబింబమీక్షించి సతియంచు భ్రమియించి
జలములోఁ దూకెడు చక్రగణము

మూతిహారించి యొండొంటి మూపురంబు
కరుణ నాకుచుఁ బరుగిడు హరిణగణము
గలిగి వర్ధిల్లు నివ్వనిఁ గాంచు కొలఁది
నాస్తికుండైన దైవంబు నమ్ముఁగాదె!

కౌశి—అదియొక గొప్ప సంగతియా! ఈప్రదేశము వీక్షించిన విరాగి రాగిగాకుండునా! అనుకూలనాయకులైన దక్షిణనాయకులు గాకుందురా!

కృష్ణు — (ఆశ్చర్యముతో) విదూషకా!

మ॥ నడుమల్లాడఁగఁ జిన్నిక్రొంజెమట మేనన్ దళ్కు లీనంగఁ బా
వడజీరాడఁగ మందహాసరుచి తేవన్ మోవి రాణింప వా
ల్జడ ద్రేలాడఁగ ముంగురుల్ వదనకంజాతంబునం దాడఁ బు
త్తడిజూకాల్ చెవిచిందులాడఁ జను నాతన్వంగిఁ గన్గొంటివే॥

మిత్రమా! ఇదేమిచిత్రము! నాఁడు మనకడకేతెంచిన వసంతికయు నానెలఁత చెంత నరుదెంచుచున్నయది! బళిరే! ఏమి యారామామణి సౌందర్యము!

ఉ॥ కన్నులు చేరెడేసి; కచకాండముఁ జూచిన బారెడేసి; కా
నన్ననొ కానరాదు; నడయా! గజరాజమదల్పు నౌర యా
క్రొన్ననబోఁడి యెవ్వరో? యరుంధతియో? శచియో? భవానియో?
పన్నగనారియో? రతియొ? భారతియో? జలజారి కాంతయో?

కౌశి—మఱే! వారెవ్వరుఁగాదు. ఎప్పుడుగాంచిన గ్రుడ్లుమిటూరించి చూడడమేకాని దేవతాస్త్రీలఁ బరమేసినను తెప్పలల్లార్పఁగలరే?

కృష్ణు—విదూషకా! వారెవ్వరుఁగాకున్నఁ దళుకుతళుకని బెళుకు చూపుల నలరారుచున్న యవ్వనితామణి యెవ్వరైయుండును?

శా॥ భూలోకంబున సంచరించుతమితో మోహంబెరూపొందెనో
బాలారత్నము గాధినందనుఁడు రంభన్ మీఱ సృష్టించెనో
ఆలోచించి నిశాచరుండొకఁడు మాయాకారమున్ దాల్చెనో
లోలాక్షిన్ విధి చేసియున్న నొకఁటన్ లోపంబు లేకుండునే॥

కౌశి—అబ్బే! వారునుగాదు. నీమేనకలు గొఱుకఁబుట్టిన కన్య సుమీ!

కృష్ణు—అది కన్నెయా?

ఉ॥ కన్నియ? కాదుకాదు కనకంబున జేసినఁ బొమ్మ యేమొ? కా
కున్నను మించుఁదీవె యిటులొప్పులకుప్పఁగ నుప్పతిల్లెనో
కన్నెల నెందఱన్గనము! కన్నులకుఁ మిఱుమిల్లుగొల్పు నా
వన్నియయా బెడంగుగలవారలఁ గంటిమె ముజ్జగంబులన్.

(వసంతిక, సత్య, సమీపమునఁ బరిభ్రమింతురు)

కృష్ణు—మాయురే! ఏమి యీయన్నులమిన్న వన్నె. కాంచినకొలఁది కన్నులు చెదరుచున్నయవే. ఇంతచక్కఁదన మెందైన వింటిమా! కంటిమా! కలవరించియైన నుంటిమా!

కౌశి—కృష్ణా ! విన కేమి! కన కేమి! కలవరించ కేమి ! రావియాకులవంటి కన్నులను, దబ్బపండ్లవంటి దవడలను, నిమ్మపండ్లవలె నిగనిగలాడు శరీరకాంతిఁ గలిగి కన్నులు ద్రిప్పుచు, బెదవి విఱచుచుఁ జేతులనాడించుచుఁ, బైఁటసవరించుచు, ముసిముసినవ్వు నవ్వుచు, నొయ్యారంబుగాఁ గులుకుచున్న యీవసంతిక కంటె నెక్కువసౌందర్యవతియా?

కృష్ణు—విదూషకా! నీ పరిహాసాలాపంబుల కేమిగాని యీ సుందరిఁ దిలకించిన భీష్మునంతటివాఁడైన దానికి దాసానుదాసుండుఁగాఁడె! ముక్కుమూసికొనిజపించు వెఱ్ఱిమునులైన నామోహనాంగియింటఁబెట్టని బంట్లుగారె! వేయేల? రంభయైన సంరంభంబునొందదే!

ఉ॥ తీరిచినట్లుకన్బొమలు దిద్దినయట్టులఁ గన్నులుండి శృం
గారమె రూపమెత్తెననఁ గన్నులపండువ సేయుచున్న యీ
వారిజనేత్ర యెవ్వనికిఁ బాణినొసంగుచుఁ బ్రేమమీఱ సం
సారముఁ జేయునో యతనిజన్మమె జన్మమనంగఁ జెల్లదే॥

కౌశి—వానిది కాదు. వానిచెంత విదూషకునివలె నుండువాని జన్మయేజన్మ.

కృష్ణు—విదూషకా! ఆదియే మోఁకాని యీ మోహనాంగిఁ నవలోకించినదాదిగా నామనంబు నవనవోన్మేష వికారంబుఁ జెందుచు

న్నయదె! ఈభామ, యీయభిరామరామ, యీలేఁబ్రాయంపులేమ, యీలావణ్యసీమ, యెవ్వరై యుండును.

కాశి—ఆమె సాత్రాజితిసుమీ !

కృష్ణు—(ఆశ్చర్యముతో) ఏమీ ! ఈకన్నియ సాత్రాజితియా

సీ॥ మణిహరించితినంచు మఱిమఱిననుదూఱు
 పరిపంధిసుతయె! యీవన్నెలాఁడి
తనతండ్రి దౌష్ట్యంబుఁ దలపోసి విలపించు
 ధీమంతురాల! యీకోమలాంగి
శతధన్వునకుసీయ సంసిద్ధమైయున్న
 కన్యకామణియ! యీకంబుకంఠి
మనసారననుఁ గోరి తనదూతఁబనిచిన
 ముద్దరాలో కో? యీముద్దుగుమ్మ
వలచికృష్ణుండు దనకేలు పట్టకున్న
బ్రతుకననినట్టి చెలియ? యీభ్రమరవేణి
ఎవ్వరెవ్వరోయంచు నేమేమొతలఁప
గడకు నాకునై కానట్టి కన్యయగునె॥

కాశి—అయినట్టు కానట్టుగా నున్నది గనుకనే గుటకలు మ్రింగకుండ ముందుగా వెళ్ళఁబెట్టితిని

కృష్ణు—విరోధుని సుతయైన నేమి! తండ్రి తప్పుగావించినఁ దనయ యేమిసేసె.

కాశి—పాము చుట్టము, పడగ పగయునా? ఈబిడ్డమాత్రమూ తండ్రియంతటిది కాదేమి?

కృష్ణు—అటు లనెద వేల?

తే॥ గీ॥ పితయుఁ బగఁబూని యుండిన బిడ్డలమిత
 మిత్రభావముతోనుండి మెలఁగుటరుదె

హేమకశిపుండు హరియన్న నెగిరిపడిన
నతనిగొల్పఁడె భక్తిప్రహ్లాదుఁ డెపుడు॥

(తిరుగుచున్న సాత్రాజితి నుద్దేశించి) విదూషకా!

శా॥ నేలన్ వ్రేలిని వ్రాయుచున్ విసగుచున్ నిట్టూర్పులన్ వీడుచున్
వాలున్ జూపుల నిట్టటుల్గనుచుఁ జెంపన్ జేయి హత్తించుచున్
గేలున్ గేలునఁబూనుచున్ బలుకసందేహించుచున్ మెల్లఁగా
లోలో నేమొ తలంచుచున్ వెడలు నా లోలాక్షి వీక్షించితే॥

విరహోత్కంఠితవలె ముఖవిలాసంబు దలంగి యింతలో నిట్లగుటకుఁ గతంబేమి! ఓహో! వారిర్వురు నీ ప్రక్కకే తెంచుచున్నటులున్నది. అల్లిబిల్లిగా నల్లుకొనియుల్లంబునకుల్లాసంబుఁ గల్పించుచున్న యీ మల్లికామందిరంబునఁ దాఁగియుండి వారియుద్యమ మేమో కనుఁగొనెదము.

(ఇర్వురు దాగియుందురు.)

సత్య—(ప్రవేశించి) చెలీ! నే నీ వనవాటిక నింకఁ గ్రుమ్మఁజాల.

ఉ॥ కోకిలమూఁక లేఁజిగురుఁగొమ్మలఁ గో యని కేరికూయ న
స్తోకపుఁ దేఁటిదాఁటులిటుఁ జుమ్మనుచున్ విరిదేనెలాని యు
ద్రేకముతోడఁ బాడఁ జెవి వ్రీలఁగఁ జిల్కలఁగూయఁజేసి న
న్వీఁకఁగలంచుచుండె వనవీధిసుమాస్త్రుఁడు నిర్దయాత్ముఁడై.

వసం—చ॥ కినుకవహింపనేల పికకీరమధువ్రత యోధులార! మిం
చినతమిమిమ్ము మీకులపుశ్రేష్ఠులమా చెలి పెంచదమ్మ! యీ
సున నెపుడైనఁగానిమిముఁ జూచెనఁటమ్మ! సరోజబాణునం
దనమతిఁగొల్వదమ్మ భయదమ్ముగ మాసఖినేఁచ ధర్మమే!॥

కృష్ణు—ఓహో! యీలేమ మరుబారికిఁ జిక్కినటులున్నదే! ఏమహాత్ముఁదలఁచి యీలేమ యీ విరహపరితాపంబున గ్రుమ్గుచుండెనో! అవలపు నామీఁద నేకలిగియున్న నాయదృష్ట మేమనవచ్చును.

కౌశి—చక్కనిచుక్క వలెనున్న యీపె చెలికత్తెగా, నన్ను దరికి రానిచ్చిన నాజన్మమే తరించునుగదా?

సత్య—తుంటవింటిచే నబలల వేధింప సాహసించు నాలక్ష్మీపుత్రు నిందింపవలెఁగాని యితరుల దూఱనేల?

కృష్ణు—(నేపథ్యమున)

మ॥ రమణీ దూఱకు లోకవారహితు ధైర్యస్థైర్యగాంభీర్య పు
ష్పమయాస్త్రాన్వితుసచ్చరిత్రుఁ ద్రిజగత్సంచారపారీణు స
ర్వమనీషివ్రజపూజితాత్ము సురసంరక్షార్థదత్తాంగు శ్రీ
కమలోపేంద్రతనూభవుఁ వివిధసత్కళ్యాణభూతుఁ మరుఁ॥

సత్య—(ఆశ్చర్యముతో) ఎక్కడనో పురుషకంఠధ్వనివినఁబడుచున్నదే!

వసం—ఔనే! అది తప్పక శ్రీకృష్ణుని కంఠస్వరమే!

సత్య—చెలీ! పరియాచకములకు సమయాసమయంబులు లేవా!

వసం—పిచ్చిదానా! నేఁ గలవరించినటులఁ గృష్ణుం డియ్యెడ కేతెం చెనేమో చూచెదము రమ్ము.

కృష్ణు—(నేపథ్యమున) శమంతక నిందాకరుండననియైన శంకింపక నా యందింత పరిపూర్ణానురాగబద్ధయైయున్న యిక్కన్నె నే నుద్వాహమాడకుండుట దోషంబుగాదె.

సత్య—(కృష్ణునికై పరిభ్రమించుచు)

సీ॥ మందారమా! దీనమందారుఁజూచితే!
తిలక! వీక్షించితే తిలకనిటలు
పుండరీకమ! యేడి పుండరీకాక్షుఁడు
కుందమా! కనుఁగొంటె కుందరదను
వేణుద్రుమమ! కంటె వేణుగానవిలోలు
బహుళి! కన్గొంటివే బహుళపాలు

మంగళ్యా! కంటివే మంగళ్యతస్కరు
బర్హిమా! యెచ్చటే బర్హమాళి

కౌశి—(రహస్యముగా) కృష్ణా! సాత్రాజితియిచ్చటికే వచ్చుచున్నటు లున్నది. నేఁడాఁగి నీవు బయల్పడుట కిదియే మంచితరుణము.

సత్య—గీ॥ వలపుగలవాఁడు నగకాఁడు వన్నెకాఁడు
ముద్దులను మూటగట్టెడు మోమువాఁడు
దాఁగడుగదమ్మ కోరి మీ తావులందు
మల్లెమొల్లలార! లతామతల్లులార!॥

కృష్ణ—(మల్లెపొదరింటనుండి వెలువడి)

శా॥ ఉన్నాఁడో కలకంఠి! పూఁబోదల నీయుల్లంబునొప్పించి నీ
వన్నెన్ వాసిదొలంగఁదోడ్పడిన యాపాపాత్ముఁడిచ్చోటనే
కన్నారన్ దిలకింపుమా! మదినినున్ గామించి నీకంటె నా
పన్నుండైదపియించు కృష్ణు పరితాపంబార్పఁ బెండ్లాడుమా॥

సత్య—(సిగ్గుచేఁ జంపకము చెంతకేఁగ వసంతిక నిష్క్రమించును)

కృష్ణ—మ॥ అనురాగస్ఫురణంబులై నిడుదలై, యబ్జాస్త్రబాణంబులై
వినయాలంకృతమూర్తులై తళుకులై భృంగౌఘతుల్యంబులై
నను మెప్పించినదూతలై యలగు శృంగారంపు వాల్చూపులన్
నెనరున్ జూపియు దాఁగదేల! చెలియా! నీవాఁడ నేఁగానఁటే॥

సత్య—(ఆ చెంతఁబరిభ్రమించుచున్న భృంగరాజము నుద్దేశించి)

మ॥ వనజాతాక్షుఁడు పద్మనాభుఁడ చటన్ వర్తింప రోలంబమా
కనులారన్ గనవేమి! సిగ్గుపడితో! కాకున్న నట్లేగవా!
ఘనరాగంబున స్వాగతంబడిగి సత్కారంబుఁ జూపింపవా
చను వుప్పారఁగ మీఁద వ్రాలి యమితోత్సాహాబ్ధిఁ గ్రీడింపవా॥

కృష్ణు—పుష్పలిహమా!

చ॥ నలినవరాస్యమందు దిలనాసయు నేత్రయుగోత్పలంబులుఙ్
గలుగుటగాంచి విభ్రమవికారమునఙ్ జరియింపనేల! నీ
కులజులు కుంతలాళివలెఁ గూడ రెయచ్చట! చెంత కేగి నా
వలపులఁ దెల్పు దూతవయి వారిరుహాననఁ జూపరాదఁటే!

సత్య—(వెలువడి)

ఉ॥ చంపకనాస నేననుచుఁ జంపకమియ్యెడ నున్నదంచు యో
జింపక మల్లెపుష్పొదఁ ద్యజించుచు నాకడ కేగ నేర్తువే?
మంపటిభృంగరాజమ? శమంతక తస్కరుఁడిందు నేరిమో
హింపఁగఁ జేయఁజాలఁడని యింపుగ ఝుంకృతిఁ దెల్పలేవఁటే!

కృష్ణు—తరుణీమణి! శమంతకతస్కరుండనని నాపై గోపింపనేల?

తే॥ గీ॥ మణిగ్రహించితినో! లేదొ మగువమిన్న
దైవమెఱిగెడుఁగాని యీ తరుణమందు
నిన్నుఁగొని దొంగనగుచు నీనన్నయట్లు

సత్య— చాలు సరసోక్తులకెగెవ సత్యచరిత!॥ (పోఁబోవును.)

కృష్ణు—(వారించి)

చ॥ అలికులవేణి! నానుడుల కల్కవహించెద వేల? కొత్తలో
వలోయివి! నీ వెఱుంగనివు! పార్థివులెందఱో కానలందుఁ గ
న్యలఁగని పెండ్లియాడరె! సుహాస్యశిరాళికి నోడినాఁడ; నీ
చెలిమిని గోరినాడ; నీకఁ జెప్పెడిదేమి యనుగ్రహింపవే॥

సత్య—చ॥ సరసుఁడ! యేటిమాటలివి! చందనగంధులఁజూచినంత దు
ర్భరమరుతాపమొంది బహుభంగుల వేడి భ్రమింపఁజేసి క
క్కురతులుదీర నా వెనుకఁ గొంకక వారల వీడునట్టి తుం
టరులను జూడమే? యెటులనమ్మగనో మగవారి కృత్యముల్॥

కృష్ణు—చెలీ! కలనైన, నవ్వులకైన, జలజాక్షులకడనైన, నాడిన మాట తప్పియెఱుంగని యీకృష్ణునిసహితముఁగాపురుషునివలె నెంచుచుంటివా?

చ॥ వెలఁదిరో! కృష్ణుఁడెందు నినువీడఁగజాలఁడు; నీయనుజ్ఞనౌ
దలధరియించువాఁడు నిరతంబును నీకనువైనయట్లులన్
మెలఁగెడువాఁడు; నెచ్చెలులమిన్నఁగనిన్ను గణించువాఁడు; బా
సలఁ బదివేలుసేయుమన జంకకఁజేయు మనఃప్రియంబుగాన్॥

సత్య—బాసలొనర్చిన ఫలమేమి!

సీ॥ బాసలెన్నియొచేసి భ్రమకొల్పి వీడడే
యలిసీలవేణి దుష్యంతనృపతి

కృష్ణు—దుర్వాసుశాపంబుతోయజాక్షికిఁగల్గ
దుష్యంతుఁ బనిలేక దూఱదేల

సత్య—ధర్మపత్నిగఁజేసి దయలేక దమయంతి
నడుకాన వదలఁడే నలవిభుండు

కృష్ణు—నడిరేయి కులకాంత నెడఁబాయ నలరాజు
కలిబాధితుఁడుకాఁడె తలిరుఁబోఁడి

సత్య—తే॥ గీ॥ ప్రముఖులేయిట్లు సతివీడఁ బాలుపడఁగ
నమ్మి నిన్నెట్లువరియింతు నళిననేత్ర

కృష్ణు— తప్పులున్నను సైఁచి హస్తంబు నిడమి
నతను పరితాపమునఁ జిక్కి బ్రతుకనబల॥

సత్య—మనోహరా! నిజముగా నీ సత్యయందు నీ కనురాగంబు గలదె! కోరి పెండ్లియాడిన రుక్మిణీకాంతయుండ నాయం దనురాగంబుండునన నేనెట్లు విశ్వసింపఁగలను?

కృష్ణు—చెలీ! ఇంతఁదనుకఁ గృష్ణుని మనోగతం బెఱుంగకుంటివే?

సీ॥ నాయికానాయకవ్యాయతార్తులఁబెంచు
శంబరాంతకుపంచశరములార

నిద్ర లేచినదాఁది నియతితో నెలవేల్పు
　　గని సర్వముఁ దిలకించు దివిజులార
అంతరంగమునఁ జొచ్చి యాంతర్యముల నెల్ల
　　ముపద్రష్టఁ జూచు త్రిమూర్తులార
బ్రహ్మకల్పితమైన పనులెల్ల సమకూర్చి
　　ప్రజలఁ గాచు దిక్పాలులార
తే॥ గీ॥ అడుగడుగునందుఁ దోడుగా నడచుచుండి
　　తనువుఁ గాపాడు పంచభూతమ్ములార
　　సత్యభామ నే మోహింప సాగినటుల
　　సాక్ష్యమిడ రారె దయఁ జూపి సాక్షి రారె॥

సత్య—మ॥ అనఘాత్మా నను గోరి మిమ్ములను ప్రసన్నం బందఁగా నేల మి
　　మ్ము నే భక్తిఁ గొలుపంగఁ జాలను? మహాపుణ్యంబు నా కబ్బునే?
　　మును నేనోమిన నోములన్నియుఁ ఫలించె మూర్తీభవింపంగఁ జా
　　లిన సన్మంగళ సంపత్తి కలుగఁ గాంత మీలుందునే?

మనోహరా! సన్నుతుఁడైన మద్వాహమునందన లేనని యెంచి ప్రసేనుని వధించి మీరలే శమంతకమణి హరించినటుల నొక యపనిందఁ గల్పించి శతధన్వుండు మనుపసాగె. ఆతని నుడువుల విశ్వసించి రాజసభయందు మిమ్ము దూషించుచు వచ్చె. నా యందనురాగంబుగల దేని సభాసభ్యంబును నిందఁ బాపుకొని నన్ను ద్వాహముఁ జేసికొందుఁడు.

కృష్ణ—ఔరా! ఎంతటి దారుణము! ఎంతటి సాహసము! ఎంతటి దురాగతము! ఎంతటి మిత్రద్రోహము! ఓరీ? శతధన్వా! బాల్యస్నేహమును మరచి యింతటి ద్రోహంబు గావించితివిరా? గోముఖవ్యాఘ్రమా! ఎప్పటికైన నీ దౌష్ట్యంబు బయల్పడదనుకొంటివా? ఈకృష్ణుని వంటివారు నీకుఁ దగిన ప్రాయశ్చిత్తము గావింపఁడని యెంచుచుంటివా?

సత్య—మనోహరా! లేశమైన జంకులేక వాఁడిట్లు మనకీడుగంబులఁ
　　జేయ సాహసించునే?

కృష్ణు—చెలీ! శతధన్వునకుఁ జేటు కాలము సన్నమైనది. వానికిఁదగిన ప్రతికారమిప్పుడే కావించి నిన్నుఁ బరిణయమాడఁ బ్రయత్నించెద. నీయాజ్ఞానుసారంబు నేఁబోయివచ్చెద.

సత్య—(పోఁబోవు కృష్ణుని వారించి) ప్రాణేశ్వరా! రుక్మిణీకాంత వలదనిన నీలేమవీడెద వేమో?

చ॥ నెలకును గల్వవ్రాలెఁ దొలినీలఘనాళికిఁ గేకివ్రాలె నె
న్నెలకుఁ జకోరివ్రాలెఁ దిననేతకుఁ బద్మినివ్రాలె సర్వధా
రిల కలచాతకంబునలె రికి మోయిక్ నినుఁగోరునన్ను నెం
దులకుఁ ద్యజింపనంగని మనోహరినాకుఁ గరంబాసంగి వే॥

కృష్ణు—చెలీ! ఇంకను నీకీ సంశయమేల?

చ॥ తలిదండ్రుల్ దగదంచుఁ జెప్పినను మిత్రశ్రేణిరోయించినన్
వలదన్నన్ హలపాణి, రుక్మిణియు సన్మార్గంబు యత్నించినన్
జలజాతాసనుఁడేని కాదనినను నీశానుఁడు బోధించినన్
గలవాణీ! నినువీడఁజాల నిదిగో గైకొమ్ము నాహస్తమున్॥

నీ సందేహము నివృత్తియైనదా! నేఁ జనవచ్చునా!

సత్య—(అడ్డగించి) మనోహరా! నన్ను మఱచెదవేమో!

కృష్ణు—చెలీ! నిన్ను మఱచి నే బ్రతుకఁగలనా! నిర్గమింతునా?

సత్య—మనోహరా! ఈశ్వరసంకల్ప మిటులుండ మనమేమి చేయఁ గలము! పోయిరండు.

కృష్ణు—(నిర్గమించుచు) కౌశికా! పోవుదము రమ్ము.

కౌశి—సాక్ష్యమ్ములఁ గోరికొనినప్పుడు చేతిలోఁ జేయి వేయించుకొని నప్పుడు నేజ్ఞాపకము రాలేదుగాని యిప్పుడు గావలసివచ్చితినేమి?

కృష్ణు—వయస్యా! కోపింపకుము. వసంతిక యేమన్నది?

కౌశి — మహానుభావుండవు కన్నులకైనఁ గనఁబడకుండునటులఁ జేసితివిగా! (కౌశికుఁడు, కృష్ణుఁడు నిష్క్రమింతురు)

కృష్ణు—(పోవుచు) అదిగో! దురాత్ముండైన శతధన్వుం డిటులనే వచ్చుచున్నటులున్నది. మనమిర్వుర మిచ్చట దాఁగియుండి వీని యుద్యమమేమో తెలిసికొని వీనికిఁ దగిన చికిత్స గావింతము. (దాఁగికొందురు)

(ప్రవేశము-శతధన్వుఁడు)

సత్య-(శతధన్వునుద్దేశించి)ఏకాంతంబుననున్న నాచెంతకేవేలవచ్చితివి!

శత—నీకొఱకే.

సత్య — మూర్ఖా! నిన్ను వరింప జాలనని నీ కెన్నిసార్లు చెప్పినను నీకు బుద్ధిరాదేమి!

శత—నిన్నే వివాహమాడఁదలంచితినని నేఁజెప్పియుండలేద!

ఉ॥ పాటలగంధి! నీదుముఖవైఖరి గాంచినదాది మారుఁడా
ర్భాటముతోడఁ గార్ముకపరంపర నన్నుఁ దపింపఁజేయన
ప్పాటుసహింపలేక నిను బల్మి గ్రహింపఁగనున్ననాకు నా
ర్టాటమణంపవే! చెలియ? రద్దియొనర్పకె నీకు మ్రొక్కెదన్.

సత్య—(కోపముతో) ఏమీ బల్మిగ్రహించెదవుగా!

మ॥ కనులారన్ నినుఁగాంచనైన ననురాగంబింతలేనట్టి క
న్యను మోహించి వివాహమాడినను సౌఖ్యంబెట్లు ప్రాప్తించురా
ఘన సంసారమునెట్లు సల్పెదవు! ప్రక్కన్ జేరి నీమచ్చ మా
పన! నక్షత్రకురీతి వెంటఁబడి కొంపన్ గోడి యమ్మింపనే!

శత— చెలీ! అఖిలసామ్రాజ్య విభవుండనైన నన్నుఁగూడి సుఖింపఁ జాలకిటు లడ్డదిడ్డంబులాడెదవేల! జగన్మోహినీ! మరుబాధకు నే నింక నోర్వఁజాల. రక్షింపుము. (కాళ్ళమీఁదఁ బడఁపోవును)

సత్య — (తొలఁగి) మరుబాధకోర్వఁజాలనని పరితపించెదు నీ వా నరక లోకబాధల నెట్లనుభవింపఁగలవు!

ఉ॥ కలవర మొందకన్న ! కలకాలము యౌవనముండదన్న ! దౌ
ర్బలమును నమ్మకన్న ! పరభామల బల్మి గ్రహింపకన్న ! కా
వల మొడిగట్టకన్న ! యమబాధల కోర్చుటకష్టమన్న ! నా
పలుకులు సైఁపుమన్న ! వలవంతల నేఁచకుమన్న చెల్లెలిన్॥

అన్నా! ఇంతటనైన నాపై మోహంబును వీడుము; ముక్తిగనుము.

శత — చచ్చిన నేమగునో యెవరు చూచివచ్చిరి ! యమలోకముండ నిమ్ము; మండనిమ్ము. ప్రస్తుతపు బాధ దొలగించి నాప్రాణంబులఁ గాపాడుము.

సత్య — ఓరీ! మోహాంధకారంబునఁ జిక్కి విద్యుత్తుల్యమై బుద్బుదప్రాయమై క్షణభంగురంబైన తుచ్ఛసౌఖ్యంబున కపేక్షించి శాశ్వతానందకరంబగు నాముష్మికసౌఖ్యంబున కేల నెలియయ్యెదవు? పరనారీలోలురైన రావణ దేవేంద్రాది బలాఢ్యులు సహితము చెడిపోయిన విధం బీ వెఱుంగవే?

శత — (స్వగతము) ఈలేమ నాకు సామవాక్యంబుల లోఁబడునటుల లేదు. ఇంక బెదరించి చూచెద. (ప్రకాశముగా) టక్కులాఁడీ! చిన్నదానవని యుపేక్ష చేసినకొలఁది మితిమీఱి ప్రేలుచుంటివా!

తే॥ గీ॥ సత్వరంబున రెండు ప్రశ్నలకునీవు
నాకుఁ బ్రత్యుత్తరము నిమ్ము నన్నుఁగోరి
కరమునిచ్చెదో ! లేకున్న ఖడ్గమునకు
నిన్ను బలిపెట్టమనెద ఫ్రౌ నెనరువీడి॥

(కత్తిదూయును.)

సత్య — ఉ॥ కత్తినిజూచి లోఁబడెదు కన్నియఁగాను; కఠోరవాక్యముల్
మత్తిలిప్రేలినన్ జడియుమానినిగాను; శరంబెయున్న నీ

నెత్తురుగండ్లఁజూచెదను నీకు మగంటిమిగల్గునేని నా
కిత్తఱి నాయుధంబొకఁటి యిచ్చి మదాంధ రణంబొసర్పుమా!

శత— చేయక చేయక గాజులు తొడిగించుకొని యింటఁగుంది కుట్లాడు నాఁడుదానితో యుద్ధమొనర్పవలయునా!

సత్య— వాచాటా! ఆఁడువారనిన నీ కంత చులకనగానుండెనా! ఆఁడువారలు నేర్వనివిద్య యేమున్నది?

సీ॥ ఘోరయుద్ధమొనర్పఁ గొంకరంచని చెప్ప
నలఘుకీర్తిఁ జరించు లలిత లేదె
గానవిద్యగ్రహించి ఖ్యాతిగాంచెదరంచు
చాటఁగా బుష్ప పాంచాలిలేదె
సంయమీంద్రులరీతి తపియింతురని తెల్ప
సుగుణాభిరామయౌ సుమతి లేదె
వివిధశాస్త్రజ్ఞాన వేదాంతధర్మముల్
శోధింప గలరన సులభ లేదె

తే॥ గీ॥ అసురగెల్చు మహామాయ నభ్యసింప
శక్తికద్దనఁ బ్రద్యుమ్ను సతియు లేదె
బుద్ధికుదురుచు నేర్వంగఁ బూనుకొనిన
వెలఁది సాధింపఁజాలని విద్యగలదె?

శత— నీ యుపన్యాసము గట్టిపెట్టి నాకోర్కెలీడేర్చెదవా! లేదా?
సత్య— నీవే యాఁడుదానవు! నీకింకొక యాఁడుది యెందులకు!
శత— నేనెటు లాఁడుదాననైతిని!
సత్య— నాతోడనైన యుద్ధముఁ జేయలేక.
శత— (కోపముతో) ఓసీ! రాకాసీ! చచ్చితివిచూడుము.
(కత్తినెత్తును.)
సత్య— (అంజలిమోడ్చి)

చ॥ హరిణగణంబులార! అనిలాగములార! ఖగేంద్రులార! కం
ధరతతులార! అభ్రశశితారకులార! దిగీశులార! కి
న్నరవరులార! సిద్ధగణనాయకులార! మదీయబాధ స
త్వరము దయార్ద్రచిత్తమున దైత్యవిరోధికిఁ దెల్పి కావరే!

కృష్ణు—(త్వరితముగాఁ బ్రవేశించి)

మ॥ తులువా! నాకుఁ బ్రసేనుభ్రాతృనకు మిత్రత్వంబో లెవర్తించియా
వలనన్యోన్యవిరోధమేర్పడఁగ దుర్వాదంబుఁగల్పించి మ
త్రిలి సాత్రాజితిఁగూడ నెంచితివె! బ్రాఁతిన్ నన్ను మోహించుని
చ్చెలికిన్ బ్రమొక్కుచు నేగవేని జడుఁడా శిక్షింతునిన్నిప్పుడే!

సత్య—దుర్మతీ! ఇంతకుమున్ను నన్నుఁ జంపెదనని ప్రగల్భములఁగొట్టు
చుంటివే! ఏదీ! ఇప్పుడు నీ సామర్థ్యంబించుకంతఁ జూపింపుము.

కృష్ణు—వనితామణీ! ఈమిత్రద్రోహికి నిన్ను వధించునట్టిశక్తిగలదా?

శత—(రోషముతో)

మ॥ అనదా! చైద్యునకీయ నేర్పడినకన్యన్ బల్మిఁగొంపోయి నా
కును దత్తంబగు కన్యకన్ వలచి జంకున్ గొంకు లేకుండ మం
తనమందేగిన కృష్ణుకంటె నిఁక మిత్రద్రోహి యెవ్వండు రా?
వనితారత్నము వీడవేని ఖలుఁడా! భంజింతునీకంఠమున్.

కాశి—చచ్చినటులఁబడియుండక యింక వాగెదవేమి?

కృష్ణు— చ॥ వలచిన కన్యలన్ గొనుట పాసమటన్న వరించనట్టి కాం
తలఁగొనఁజూచు టెంత దురితంబొ? యదేవనిమిత్రభేదముల్
సలుపఁగఁజూచు టెంత కలుషంబొ? త్వదీయదురంతకృత్యముల్
వెలువడెనంచు సిగ్గుపడి వెంగలి చావక బ్రేలెదేలరా?

శత—ప్రసేనునిబొక్కార్చి శమంతకమణి నపహరించిన పాపాత్ముండు
చావవలెఁగాని నేనేల సిగ్గుపడిచావవలెను?

సత్య—పశువా! ఇంకెగిరకుము. నీకుఁదగిన శిక్ష యిప్పుడే కాఁగలదు. ఎప్పటికైనఁ బరవనితాపేక్షకులకుఁ బరిభవము గలుగకుండునా!

కృష్ణ—నోటికివచ్చినట్లు వాగిన నీలేమసియండఁ జేరు నను కొంటివా? ఇంతవఱకు నీతాంత్రికము నాకుఁ దెలియదనుకొంటివా? ఇంకను నీమోసకృత్యంబులు నాయెడ సాగివచ్చుననుకొంటివా!

తే॥ గీ॥ ప్రల్లదంబుల మితిమీఱి పలుకుదేని
ఖలజ ! నీక కంఠనిర్గళితరక్త
సిక్తమచ్చక్రహతి ముక్తజీవుఁ జేసి
వివిధభూతాళి హర్షింప విందొనర్తు॥

శత—కృష్ణా! నీ చక్రంబు నేనెఱుంగనిదియా! నీవిక్రమంబె నెఱుంగనిదియా! అమ్మపుట్టినిల్లు మేనమామచెంతఁ బొగడవలయునా?

శా॥ చక్రీ! యాయువనుఁడు నిన్నతిమి సచ్చౌర్యంబుఁ జూపించుచోఁ
విక్రాంతుండగు మాగధుండు మధురన్ వెన్నాడి వేధించుచోఁ
జక్రంబుండదొ హస్తమందు? రిపులన్ సాధింపయోజింపవో
వక్రంబయ్యెనొ బుద్ధి? విష్ణుమహిమన్ వర్ధిల్ల లేకుంటివో?

సత్య—ఆఁడుదానితోనైన సంగ్రామం బొనర్పఁ జేతఁగాని పందవీ శూరాగ్రేసర చక్రవర్తి నెదిరింప సాహసించెదవేమి?

శా॥ కాళీయోద్ధతిడించి వత్సదనుజన్ ఖండించి చాణూరునిన్
దూలన్ద్రోసి గిరీంద్ర మెత్తి మయపుత్రుం జీరి మత్తేభమున్
నేలన్గూల్చిన కంసవైరిగెలువన్ నీబోంట్లకున్ సాధ్యమే
చాలుంజాలువృథాప్రగల్భములునీఝుంఝూటముల్ మానుమా!

శత—సాత్రాజితీ! నామాటలు ప్రగల్భములు, నీనివి వీరాలాపంబులునా? (వికావికనవ్వి) ఈ వెట్టిగొల్లఁడె శూరాగ్రేసరుండైనఁ గానివా రెవ్వరు?

కౌశి—కృష్ణా! వీనిపసి శృతిమించి రాగమునఁ బడుచున్నదే?

కృష్ణు—పంచ॥ నిరంతరావ లేపజన్య నిష్ఠురప్రసంగముల్
దురాత్మ! ప్రేలకుండ నీదు దుర్మదం బణంతురా

శత— దురాకృతంబులన్ దలంగద్రోః ప్రతాపశక్తినిన్
బరాభవింతునాజియందుఁ బాఱుఁబోత చూడిదే!

(ఇర్వురు పోరాడ శతధన్వుండు పాఱిపోవును)

కృష్ణు—(వెంబడించి)

ఉ॥ సంగరభూమివీడి రభసంబున నాఁడుదివ్రాలె నీవుపా
ఱంగఁ బ్రతాపమెక్కొ! రణరంగమునం దెదిరించి నన్నునో
వ్వంగ నొనర్తునంచుఁ బలువంకలఁ గూసినకూఁతలోరి ప
ల్కంగనురాదె నిల్చియిటుఁ! గారులుప్రేలిన లాభమేమిరా?

సత్య—(కృష్ణునినివారించి) సంగ్రామరంగంబున వెన్నిడి పాఱిపోవు చున్న యీ పిఱికివానిపై కేగి మీరేల యాయాసపడెదరు? ఆబెడి దునిచేతిలో నాకెట్టి యిక్కట్టులు వాటిల్లకుండ నన్ను మీవెంటఁ గొనిపొండు.

కృష్ణు—కౌశికా! సాత్రాజితీ సమేతముగ మనగృహంబునకుఁ బోవు దము రమ్ము.

(అందఱు నిష్క్రమింతురు.)

# సాత్రాజితీ పరిణయము.



## షష్ఠాంకము.

---

శ్రీకృష్ణసౌధము : అక్రూరబలరాములు కూర్చుండియుందురు.

బల—అక్రూరా! బిలముఖమ్మునఁజొచ్చిన తమ్ముం డింకను రాఁడేమి?

మ. కటకంబుం జొరఁబాఱిపోవుతఱి మార్గశ్రాంతుఁడై చిమ్మ చీఁ
కటులం దాఁగెనొ! జాంబవంతునకు సంగ్రామస్థలిం జిక్కెనో
చటులోగ్రోరగదష్టుఁడయ్యెనొ! పిశాచశ్రేణి బాధించెనో
పటుదర్పంబునమించి కృష్ణు దనుజవ్రాతంబు ఖండించెనో!॥

అక్రూ—రామా! శాత్రవభీమా!

శా॥ అక్షీణోగ్రపరాక్రమస్ఫురణ దైత్యశ్రేణిఁ జెండాడ న
ధ్యక్షుండై యసురాళిచేఁబడునె! ధైర్యస్ఫూర్తిఁ బోనాడి దై
న్యక్షిప్తాత్ముఁడవై భయంపడఁగనేలా! చూడు కృష్ణుండు ప్ర
త్యక్షంబయ్యెడు నేఁడొ యెల్లియొ శమంతంబెట్లొ సాధించుచున్॥

బల—హా! సోదరా! హా! వీరాగ్రేసర ధురంధరా! హా! విపక్షశిక్షైక చక్రధరా! హా అసురధరాధర పురందరా! హా! శరణాగతరక్షక కంకణధరా! నన్నువీడి నీవెందులనుంటివి! ఏమైతివి! ఛేదింపరాని యేపద్మవ్యూహములోఁ దగుల్కొనియుంటివి? తొలగింపరాని యెవ్వరివలలోఁ జిక్కుకొనియుంటివి! అక్కటా! నిన్నుఁ గనలేక కన్నీరు మున్నీరుగా విలపించు దేవకీవసుదేవుల గతి యేమిసేయఁ దలంచితివి! ఈ వియోగదుఃఖము నేనెట్లు భరింతును. (చింతించును)

కం॥ కృష్ణుఁడె తల్లియుఁ దండ్రియుఁ
కృష్ణుఁడె సచివుండు గురుఁడుఁ గృష్ణుఁడె హితుఁడున్
కృష్ణుఁడె నా వరదైవముఁ
కృష్ణుని విడనాడి యింక నెట్టులమనుదున్॥

అక్రూ—కృష్ణాగ్రజా! శత్రుగోత్రబిడౌజా! ఏల నీకీ మనోవికల్పము!
ప్రాకృతమనుజునివలె నీవును గంట నీరుగార్చెదవేల!

బల—మిత్రమా! సజీవుండైనఁ గృష్ణుఁ డింతకాల మిచ్చట కేల రాకుండును?

అక్రూ—మ॥ అనుజన్ముండొకమర్త్యమాత్రుఁడె! సితాబ్జాక్షాంశజన్ముంపఁడే! దనుజానీకమువానిద్రుంపఁగలదే! దైత్యాంతకుండీల్గినన్
వనరాసుల్ భువినిండకుండునె! నభోభాగంబు ఘూర్ణిల్లదే!
జనసంక్షోభముగల్గ నెల్లెడ తమిస్రస్ఫూర్తి వ్యాపింపదే?

బల—(ప్రవేశించుచున్న సత్రాజిత్తు నుద్దేశించి)

శా॥ ఓరీకూళ! మదాంధ! ద్రోహి! ఘనగర్వోన్మాద! వాచాట!దు
శ్చారిత్రాత్మక! మామకానుజుని దుస్తంత్రక్రియన్ బాపి యు
గ్రారణ్యంబుననుంచి చాలకది యేలావచ్చితీవింక! పో
పోరా లేశముసిగ్గులేదా! ఇటులన్ మూర్ఖించి రాఁజెల్లునే?

సత్రా—(తెలతెలఁబోయి) వసుదేవాత్మజా! కృష్ణాగ్రజా! మణినేకాక నాసుతయైన సత్యభామామణినిసహితము సంగ్రహించుకొని వచ్చిన నీయనుజునకుఁ దగినబుద్ధి చెప్పుకొనఁజాలక నన్నేల నిందించెదవు? మీకీ మర్యాద లెవ్వరు నేర్పిరి!

అక్రూ—సాత్రాజితినిఁ గృష్ణుండు గొనివచ్చెనని నీ కెవ్వరు సెప్పిరి?

సాత్రా—శతధన్వుఁడు.

బల—అక్రూరా! ఆదురాత్ముం డటులనుడువఁ గతంబేమి?

అక్రూ—కృష్ణునేకాని శతధన్వుని వివాహమాడనని సాత్రాజితి వచించినందున మనకృష్ణునిపై శతధన్వునకధికమాత్సర్యంబుఁగలదు.

సత్రా—ధర్మస్వరూపుండవైన నీ వేల యాశతధన్వుని నిష్కారణముగా దూఱెదవు!

అక్రూ—ఏమి! నేను నిర్హేతుకముగా నిందించుచుంటినా? ప్రసేనుని రూపుమాపి శమంతకమణి కృష్ణుఁడేయపహరించెననితోఁలుదొలుత

నీకుఁ జెప్పినదెవరు!

స|త్రా—శతధన్వుఁడే! అయినఁ గృష్ణుండు మాసత్యను గొని రాలేదని నీవెట్లు చెప్పఁగలవు!

అ|క్రూ—మహానుభావుండైన శ్రీకృష్ణుఁడేమి! ఇట్టి దుష్కార్యంబుల నాచరించుటేమి!

స|త్రా—రాజవరులెందఱో కనుచుండ రుక్మిణీకాంతఁ గొనివచ్చిన ఘనుం డెంతకుఁజాలఁడు?

బల—పలుగాకి! కృష్ణద్వేషియైన యాశుంఠవాక్కుల విశ్వసించి నా న్నైనఁగాక నాతమ్ముని దూషించెదవేల?

శా॥ వ్రీడాశూన్యవిలోలమానసుఁడవై భీతిల్లకేవిట్లు కు
య్యాడంగన్సలకొంటి వేనిఖలదైత్యానీకసంఛేదన
క్రీడోద్వేలహలాంచితోగ్రతము దోర్వీర్యంబుఁజూపించి నీ
వోడాగోడపునర్తనంబడఁతు శ్రీకృష్ణుండు హర్షింపఁగాన్॥

అ|క్రూ—(సత్రాజిత్తునుద్దేశించి) అనుజవియోగోద్భవదుఃఖాతిశయము చేఁబలుకుచున్న వీని నిష్ఠురోక్తులఁ గమనింపకుము.

స|త్రా—అ|క్రూరా!

శా॥ డెందంబందున దుఃఖమేర్పడినఁ దండ్రీ లోననద్దాని జూ
పేందుండు న్గరళంబునుంచినటు లెంతేనిల్ప లేకుండ నీ
చందానన్ శిఖఁ ద్రొక్కఁ గోఁతివలె నీర్ష్యంజెందులం ద్రొక్కనా
నందంబందుచు మానవంతు లభిమానంబుంచి సైరింతురే!

బల—సహింపక నీవేమి సేయఁగలవు? (గద ద్రిప్పి పైకురుకును.)

అ|క్రూ—(ఉభయులను వారించి) రామా! ఆత్మజను గానరాక దుఃఖించుచున్న యీ స|త్రాజిత్తునిపై కేగుట ధర్మమే!

బల—అ|క్రూరా! పాపవిదూరా!

ఉ॥ లేశము గొంకులేక యవలీలఁ బ్రసేనునిజంపి దుర్వ్యథా
వేశముచే శమంతమటవీస్థలిఁ గృష్ణుఁడె దాచెనంచు నా

బల—(సత్రాజిత్తును విడిచి) తమ్ముఁడా! చేయి విడువుము.

మ॥ తనయిచ్ఛాగతి వాగుచుఁ బ్రబలితమాత్సర్యైకచిత్తంబునన్
మనవారల్విన సత్యభామను శమంతంబీవె చోరక్రియ
న్గొనినట్లాలెడఁజాటి లేశమును జంకుంలేక నీకీర్తికిన్
ఘనభంగంబు నొనర్పనెంచు నితనిన్ ఖండింపఁగాఁ జెల్లదే?

కాశి—(సత్రాజిత్తు నుద్దేశించి) ఓహో! ఎవరువీరు? శ్రీకృష్ణుని నిందించిన మహాత్ములా?

కృష్ణు—సోదరా! ద్రవ్యంబు గోల్పోయినవానికి స్థిమితమనం బెట్లుండును! అట్టివానిని దండించుట దోషంబుగాదె!

కాశి—ఔను. ఇంత ఘనకార్య మొనరించినవానిని ముద్దుపెట్టుకొనవలెఁగాని శిక్షింపవచ్చునా?

అక్రూ—కృష్ణా! శమంతకమణిని సాధించితివే!

కృష్ణు—మణినేకాదు. సత్యభామామణిని సహితము గొనివచ్చితి.

బల— శమంతక మెట్లులభించె! సాత్రాజితినెందులకుఁ దెచ్చితివి!

కృష్ణు—జాంబవంతునిజయించి దివ్యమణిఁదెచ్చితి. చెఱపట్టఁ బ్రయత్నించుచుండిన శతధన్వునిగెలిచి యీకన్యామణిఁదోడ్తెచ్చితి.

బల—తమ్ముఁడా! ఏమిపనిచేసితివి! శతధన్వునిగూడనరదంబునకంటఁగట్టి యేలతీసికొనిరావైతివి!వానిమోసకృత్యంబులు వానినోటనే పలికించిన నీసత్రాజిత్తునకు బుద్ధివచ్చియుండునే!

సత్రా—(సత్యనుద్దేశించి) అమ్మాయీ! ఈమహానుభావుండు వాక్రుచ్చినది వాస్తవమే?

సత్య—(సత్రాజిత్తుతో) జనకా! అదంతయు సత్యమే.

(సాత్యకి శతధన్వునిఁ బట్టుకొని ప్రవేశించును)

సత్రా—(పండ్లుపటపటఁగొఱుకుచు) సుహృద్ద్రోహి! శతధన్వా!నన్ను మోసగించి నాచేనెట్టిదుష్కార్యంబులఁ జేయించితివిరా! వెట్టివాఁ

డనై నీమాటలఁబాటించి నిరపరాధుండైన శ్రీకృష్ణుని నిండించినే నెంతటిదుర్గతులకు లోనైతిని! కృష్ణద్వేషజ్వర పీడితుండవై యా పుణ్యమూర్తిమీఁద నపనిందలఁ గల్పింప సాహసించితివే!

కం॥ తంపులఁ గొల్లగఁ బెట్టుచుఁ
గొంపలనార్పంగఁ జూచు కూళవునిన్నున్
జెంపలువాయింపకనా
కొంపకురానిచ్చి యెంతఁ గోల్పడినాఁడన్! (కొట్టఁబోవును)

కృష్ణు—(వారించి) ప్రసేనాగ్రజా! నీవూరకుండుము. తమ్ముఁడా! వీని నీవిట కేల తెచ్చితివి!

సాత్య—మణినేకాక సత్యభామామణినిగూడఁ గృష్ణుండు సంగ్రహించెనని యదేపనివాగుచుండ వీనిజింహ్వాకుఁ దగిన చికిత్స సేయ నీడ్చుకొని వచ్చితి.

శౌరి—(శతధన్వును ద్దేశించి) ఓహో! రాజసముఁగలిగిన ధీరులా!

కృష్ణు—శతధన్వా! దయదలఁచి విడిచిపెట్టినందుల కిప్పటికిని నీదుర్వృత్తిమానవైతివె!

శౌరి—కృష్ణా! కౌశికుఁడీదండంబున వీనికి దేహశుద్ధిఁగావింపనిదేవీనిని బట్టిన దుర్మదపిశాచము వదలిపోవునా!

సాత్య—తే॥ గీ॥ కరుణచేఁదన్నుఁ గాపాడునరునికైన
దుర్జనుఁడు కీడొనర్పక తొలఁగిచనునె?
పాలుపడఁబోసి తనుఁబెంచువానినైనఁ
గాటువేయదె కాలాహిఁగలుషమనక॥

శత—(భక్తిపూర్వకముగాఁ గృష్ణుని కాళ్లమీఁదఁబడి.)

ఉ॥ దీనవిషాదహారి! శ్రితదేవవిపత్పరిహారకారి! య
జ్ఞానతమోవిదారి! బుధసన్నుతశౌరి! నిశాచరారి! స
న్మానితవేదచారి! మునిమండలచిత్తసరోవిహారి! దు
ర్మానవసంఘువైరి! అనురాగముతో ననుఁగావుశ్రీహరీ

**కాశి**—[శతధన్వును ద్దేశించి] నాకాళ్ళుగూడఁ బట్టుకొనుము.
**బల**—తమ్ముఁడా! మిత్రద్రోహముగావించిన యీదురాత్ముని శిక్షింప వలెఁగాని మన్నింపఁగూడదు.

**శత**—కృష్ణా! మోహాంధకారమున నేనొనర్చిన యపకృతి మన్నింప వేఁడెద. వ్యామోహ మెంతకుఁజాలదు?

మ॥ కులగోత్రమ్ములఁగూలఁద్రోయదె! వృథాక్రోధంబుఁగల్పింపదే
మలకల్ పెట్టదె! మత్సరంబొసఁగదే! మానాభిమానంబులం
దలఁగఁ జేయదె! సాహసంబిడదె! మిత్రత్వంబుఁబోనాడదే!
అలతన్గూర్పదె! సద్యశంబడఁపదే! వ్యామోహ మోమాధవా!॥

**కృష్ణు**—అగ్రజా! శరణుఁజొచ్చినవాని బాధించుట యశస్కరంబే!
**కాశి**—ప్రసేనాగ్రజా! ఇప్పటికైన శతధన్వునికిని శ్రీకృష్ణునకును గలిగిన తారతమ్యము గుర్తింపఁజాలితివా!
**సత్రా**—గుర్తించడమేకాదు. మహాత్మా ? అనుభుక్తికే వచ్చినది.
**కృష్ణు**—శతధన్వా! పశ్చాత్తాపపూర్వకంబుగా నిప్పుడయిననీదుర్నయ మీసభామధ్యంబున నుడివి నీదారిని నీవేగుము.

**శత**—[అంజలిమోడ్చి]

తే॥ గీ॥ నవ్వులకునైన సిరికైన నారికైన
నింక నెద్దానికైన స్నేహితులయెడల
ద్రోహబుద్ధిఁ జరించెడు దుష్టమతులు
సిరులఁగోల్పోయి నావలెఁ జెడుదురెపుడు॥

**బల**—ఇఁకనైన బుద్ధిగలిగి ప్రవర్తింపుము. పొమ్ము.
[శతధన్వుఁడు నిష్క్రమించును].

**సత్రా**—(రామకృష్ణులనుద్దేశించి) శతధన్వునిమాటలనమ్మి మీ యెడల నేనొనర్చిన నేరంబుల మన్నింపవేఁడెద.
**కృష్ణు**—[సత్రాజిత్తునుద్దేశించి]

ఉ॥ నేరము లేమి చేసితివి! నేర్వక చేసినఁగావుమంచు వే
మారును నీవుమమ్ము బతిమాలఁగ నేల! విధాతృనాజ్ఞ నె
వ్వారికిదాఁటశక్యమగు! బాలసుధాకరుఁ బ్రాక్చతుర్థినే
క్షీరములందుఁగన్గొనుటఁ జేకుఱె నాకపవాదకష్టముల్॥

బల—ప్రసేనాధ్రజా!

తే॥ గీ॥ శాపవిధిఁ గృష్ణుతలపైని మోపఁబడిన
నిందలకు మూలమీవని నేనొనర్చి
నట్టిదోషముల్ మన్నింప నభిలషించి
మ్రొక్కుచున్నాను కరముల మోడ్చినీకు॥

స్త్రా—[లేవనెత్తి] రామా! దైవనిర్మాణమిటులున్నను శమంతకాప
వాదంబునకు నేనేగదా కారణభూతుండను!

కృష్ణు—విధికృతమై వచ్చు విపత్తులకు మనమేమి చేయఁగలము!
[స్త్రాజిత్తును ద్దేశించి] మహాత్మా! ఇంకనీ శమంతకమణిని నీవు
గైకొనుము. [మణినిచ్చును.]

స్త్రా—కృష్ణా! నాతప్పులుమన్నించి యీమణిని నీవే ధరింపుము.
సాత్రాజితిని భార్యగాఁగైకొని నన్ను ధన్యుని గావింపుము.

కృష్ణు—ప్రసేనాధ్రజా! మాకిట్టిమణు లనేకంబులుగలవు. ఆమణినినీవే
గ్రహింపుము

బల—[స్త్రాజిత్తునితో] నీయిష్టానుసారంబుఁ బరస్పరానురాగబద్ధు
లయిన కృష్ణ సాత్రాజితుల వివాహంబుఁగావించి కృతార్థుండ
వగుము.

స్త్రా—కృష్ణా! మీయన్నగారు వచించినటుల నీ సత్యభామను నీ
ధర్మపత్నిగా నిప్పుడే పరిగ్రహింపుము. [సత్యాహస్తమును గృష్ణుని
కరములో నుంచును.]

అక్రూ—అదిగో! వధూవరుల నాశీర్వదింప ముల్లోకపూజితుండయిన గజాననుండు నిట వచ్చుచున్నవాఁడు.

(గజాననుఁడు ప్రవేశింప నందఱు నమస్కరింతురు.)

కృష్ణ—వందనమయ్య యీశ్వరసుత వంద్యగుణాకర! స్కందసోదరా!
వందనమయ్య విఘ్నపరిపాలక! దేవగణాధినాయకా!
వందనమయ్య మూషికవరవాహన! భావజవైరినందనా!
వందనమయ్య మత్తగజవక్త్ర! సురాసురలోకపూజితా!

గజా—కళ్యాణమస్తు. కృష్ణా! నిరంతరోపాసనానురక్తమైన నన్నుఁ బ్రార్థించితివిగాన నీమనోరథంబు దీర్చి నీకు వరంబుల నీయవచ్చితి.

కృష్ణ—ప్రమథగణాధిపా! పార్వతీనందనా!

తే॥ గీ॥ దుస్సహంబైన యపనింద తొలఁగిపోయె
వలచి నను సత్య వలచెను భాగ్యము బ్బె
జాంబవతికూఁడ నాకొక జాయ యయ్యె
నింక నీప్సితమేముండు సిద్ధచరిత?

అయిన నీవు ప్రసన్నాంతరంగుఁడవైతివి గాన నిట్లు గోర్దును.

భరతవాక్యము.

చ॥ సురుచిరమైన భాద్రపద శుద్ధచతుర్థి ప్రదీశుద్ధినిక్కథన్
నరులు పఠించినం దెలిపినన్ వినినన్ స్మరియించి యక్షతల్
శిరమున దాల్చినం బ్రతిశీతమయూఖుని గాంచవచ్చు దు
ర్భరమగు నిందలెవ్వియును వారికిఁ బుట్టకుండ నుండుతన్॥

గజా—తథాస్తు.

సమాప్తము.

*

# తప్పొప్పుల పట్టిక.



| పేజి. | పంక్తి. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| 14 | 17 | * | తిరిగ |
| 19 | 4 | యథేచ్ఛప్రాణ | యథేచ్ఛఁబ్రాణ |
| 24 | 8 | వయ్యానే | వయ్యోనే |
| 26 | 8 | గ ర్వ | గర్వ |
| 31 | 7 | ప్రకాశము | (ప్రకాశముగా) |
| 34 | 10 | నింబసూను | నిస్నజార్యు |
| 36 | 23 | వ్రిక్కలై | వ్రిక్కలై |
| 38 | 13 | గజే | గజే |
| 43 | 43 | నలపున | వలపున |
| 44 | 27 | వ్వానిఁజూచు | వ్వానిఁగాంచు |
| 46 | 10 | * | పండ్ల |
| 47 | 15 | తలఁప | తలఁపఁ |
| 49 | 13 | కేలం | కేతెం |
| 51 | 17 | క్రొత్తతొ్ర | క్రొత్తతో్ర |
| 52 | 5 | యొట్టులన్ | యట్టులన్ |
| ,, | 19 | లువ్వను | లున్నను |
| 55 | 15 | * | రాటమ |
| 58 | 16 | ద్రోహి | ద్రోహి |
| 58 | 19 | పానమ | పాపమ |
| | ,, | వరించ | వరింప |
| 59 | 7 | * | జనానీక |

* అక్షరములు సరిగా కనిపించనిచోట్లు.